Photo by A. L. Syed



బహుమతి
పొందిన వ్యాఖ్య

దూర ప్రయాణానికి

పంపినవారు :
జి. యస్. లక్ష్మీదేవి, మద్రాసు - 12.

# రాజా సులోచన తెలుపుకు, మరియు శుద్ధతకు లక్స్ టాయిలెట్ సబ్బును కోరుకొనును

రాజా సులోచన సౌందర్య సూచనలు


















సినిమా తారలకు
సౌందర్యమునిచ్చు
శుద్ధమైన తెల్లని సబ్బు

భారతదేశంలో తయారుచేయబడినది

LTS. 476-50 TL

# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



ఇవిగాక రంగుల బొమ్మ కథ, ఫోటో శీర్షికల పోటీ, వార్తలు, విశేషాలు, మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు.

ఏప్రిల్ 6 విడుదల



నరసు స్టూడియోస్

# భలేరాముడు

డైరెక్షన్:
వేదాంతం రాఘవయ్య



RAJSHRI Release

BHARAT STUDIO

# చెవులలో రింగుమంటూనే ఉంటుంది




కోడక్ లిమిటెడ్ (ఇంగ్లండులో స్థాపితము) బొంబాయి - కలకత్తా - ఢిల్లీ - మద్రాసు

---

ఎల్లప్పుడూ మంచి చిత్రములను తీయగలరు!







# ప్రకటన

1956 మార్చి 1-వ తేదినుండి మా 'నటరాజ' 'విక్టోరియా' బ్రాండు మెషినరీలున్ను, వాటి స్పేరు పార్టులున్ను, నూటికి 10 వంతున తాత్కాలికంగా హెచ్చింపబడినవని మా ఖాతాదారులకు ఇందుమూలమున తెలియజేస్తున్నాము. ముడిసరకుల వెల అపరిమితముగా హెచ్చిపోవుటవల్లనే తప్పనిసరిగ ఈ మార్పు చేయవలసివచ్చినది.

ముడిసరకుల వెల తగ్గి, సరకు విరివిగా దొరికినవెంటనే మా ఖాతాదారులకు ధరలు మళ్లీ అనుకూలముగ మార్పుచేయబడును.

ధరల మార్పు సూచించే పట్టిక పంపబడును.

జలగం సుబ్రహ్మణ్యాం నాయుడు అండ్ సన్సు

& పి. కృష్ణమూర్తి నాయుడు

గుత్తదారులు :

**ది నటరాజ ఇంజనీరింగు వర్క్సు,**

17 ఎర్రబాలుచెట్టి స్ట్రీట్ :: మదరాసు-1

# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

ఏది ధర్మం? ఈ సమస్య జీవితంలో అందరికీ వస్తుంది. గొప్ప గొప్పవారికికూడా ధర్మసందేహాలు కలుగుతాయి. అటువంటి సందేహాలను జ్ఞానులు తీర్చుతూ ఉంటారు. "మనుష్యులు ఇలా నడుచుకోవటం ధర్మం," అని గొప్పవాళ్లు నిర్ణయించటమూ, ఇతరులు ఆ ధర్మాన్ని అచరణలో పెట్టటమూ అచారంగా ఉన్నది.

అయితే "ధర్మాచరణ" అన్న జాతకకథ మనకొక కొత్త నీతిని ఉపదేశిస్తున్నది. ఆ నీతి ఏమంటే: ఒకరు రాసిపెట్టిన ధర్మాన్ని అచరణలో పెట్టటం అంత గొప్ప విషయంకాదు. ఆత్మవిమర్శ ద్వారా ప్రతిఒకరూ తమ ధర్మాన్ని తెలుసుకోవాలి. ఇదే ఉత్తమధర్మం. ఇంద్రప్రస్థంలో బోధిసత్త్వుడి పరిపాలనకింద ఇలాగే ధర్మాచరణ జరిగింది. అందుకే ఆ రాజ్యం సుభిక్షంగా ఉంది.

ఏప్రిల్ 1956



సంపుటి 18
సంచిక 4

# అట్టివీాది బొమ్మ

అరణ్యవాసంలో కష్టాలు పడుతున్న పాండవులను చూసి ఆనందించుదామనీ, వారికి తన వైభవం చూపింతామనీ అట్టహాసంగా బయలుదేరిన దుర్యోధనుడు, చిత్రసేనుడనే గంధర్వుడిచేత చిక్కి, పాండవులచేత విడిపించబడ్డాడుగదా.

అలా భంగపాటుచెంది దుర్యోధనుడు కర్ణ శకుని దుశ్శాసనాదులను చేరుకుని, తన సైన్యాలతోసహా హస్తినాపురానికి బయలుదేరాడు. చీకటిపడగానే ఒక జలాశయంవద్ద డేరాలు వేసి విడిశారు. అప్పుడు దుర్యోధనుడి డేరాలోకి కర్ణుడు వచ్చి, "మహారాజా, ఆ గంధర్వుణ్ణి నీవు గనక జయించి తిరిగి వచ్చావు గాని, మేమైతే తప్పక ఓడిపోయేవాళ్లం!" అని ప్రశంసించాడు.

పరాభవంతో కుళ్ళిపోతున్న దుర్యోధనుడుకళ్లనీళ్లు కుక్కుకుంటూ కర్ణుడితో జరిగినదంతా చెప్పి, " ఇంత అవమానంపాలయి యింకా బతికివుంటానా? నేను ప్రాయోపవేశం చేస్తున్నాను," అంటూ తన ఆభరణాలూ, దుస్తులూ తీసివేసి నారబట్టలు ధరించి, దర్భాసనంపై పడుకున్నాడు.

"మహారాజా, ఇందులో అవమానం ఏమున్నది? పాండవులు నీ బంటులు. నిన్ను శత్రువునుంచి విడిపించటం వారి ధర్మం. బంటుల ధర్మమే వారు నిర్వర్తించారు. ఇందులో వారి ఆధిక్యత ఏమీలేదు!" అని కర్ణుడు దుర్యోధనుడికి నచ్చజెప్ప యత్నించాడుకాని లాభంలేకపోయింది.

దుర్యోధనుడు ప్రాయోపవేశం చేశాడన్న సంగతి పాతాళంలో ఉన్న రాక్షసగణాలకు తెలిసింది. వారు వెంటనే హోమంచేసి మంత్రాలు చదివారు. అగ్నిగుండంలోనుంచి కృత్య అనే శక్తి వెలువడి వచ్చి, రాక్షసులను, "ఏమి సెలవు?" అని అడిగింది. "నీవు వెళ్ళి, ప్రాయోపవేశం చేసివున్న దుర్యోధనుణ్ణి తక్షణం ఇక్కడికి తీసుకురా!" అన్నారు రాక్షసులు. కృత్య అలాగే చేసింది.

ఆ రాత్రి తెల్లవార్లూ రాక్షసులు దుర్యోధనుడితో మాట్లాడారు. "మా ఆశలన్నీ నీపైనే పెట్టుకుని వున్నాము. పెద్ద యుద్ధం రాబోతున్నది. అందులో దేవతలు పాండవుల పక్షం వుంటారు. మేమంతా నీకు అండగావుండి, యుద్ధంలో నీకు విజయం సాధించిపెడతాము. అందుచేత నీవు చావటానికి యెంత మాత్రమూ వీలులేదు," అని రాక్షసులు దుర్యోధనుడికి హితబోధ చేశారు. తెల్లవారుతూనే కృత్య, దుర్యోధనుణ్ణి స్వస్థానానికి చేర్చింది.




విను మహిలారోప్య - మను పట్టణమ్ము
వెనుక, దక్షిణభూమి - వెలయుచునుండె.
అమరేంద్రవైభవుం - డా యూరిరాజు ;
అమరశక్తి యటందు - రాతని జనులు.

ముప్వురు కొడుకులు - మూర్ఖులైరంచు
చివ్వుమన్నది రాజు - చిత్తమ్ములోన.
చింతతో మంత్రుల - చేరంగ బిలిచి
మంతన మ్మొనరించి - మాట్లాడె నిట్లు :

"తెలివిమాలిన కుమా - రుల పాడునడత
తెలియుగదా మీకు - తీర్పరులార!
చదువు సాములు లేని - చవటలై వీరు
పదుగుర నవ్వుల - పాలయినారు.

కొడుకులు లేకున్న - కొంతయే దిగులు
కొడుకులు పోయిన - కొంతయే దిగులు.
కొడుకులు మూర్ఖులై - కొంపలో నున్న
కడదాక దిగులున - కాలిపోవలయు.

కావున వీరికి - కాసంత తెలివి
ఏవిధమ్మున గల్గు? - ఎది ఉపాయమ్ము?
తలపోసి ఒక దారి - తెలియంగజేసి
కలత మాన్పించి, న -న్నలరించ వలయు.

ఐదు వందల మంది - అయ్యు లున్నారు,
నాదు మాన్యమ్ముల - నమలి మ్రింగుచును.
నా కుమారుల కెట్లొ - నయ శాస్త్రసిద్ధి
చేకూర్చు మార్గమ్ము - చెవివేయు డయ్య!"

విద్వాన్ విశ్వం



అను రాజు మాటల - నాలించి వారు
వెనుకముందులు జూడ,-అనె నొక్క డందు.
సామాన్యమా దేవ - శాస్త్రాలు చదువ?
ఏమాత్రమైనను - ఎన్నేండ్లు పట్టు!

పట్టి సాధించిన - వ్యాకరణమ్మె
పట్టు పన్నెండేండ్లు - పలు మాట లేల?
ధర్మార్థ కామశా -స్త్రమ్ములలోని
మర్మమ్ము దెలియంగ-మఱి ఎన్ని యేండ్లో?

ఏమ్మాట సుమతియు౯ - పెదమంత్రి లేచి
అమ్మహారాజుతో - అనె మెల్లగాను.
అన్ని శాస్త్రమ్ముల - నంత కాలమ్ము
మన్నించి చదువుట - మాటలు కాదు.

ఇమ్మహి జీవిత - మేమి శాశ్వతము
నమ్మక మెట్లు అ - న్నాళ్ళుందు మనుచు?
అంతులేనిది విద్య; - అల్పమాయుస్సు;
ఎంతెంత విఘ్నాలొ! - ఎవ్వరి కెఱుక!



కావున నేదొ సం - గ్రహ శాస్త్ర మొకటి
ధీవర! బోధించు - తీరు కన్గొనుడు.
అఖిల శాస్త్రమ్ములు - చదివిన వాడు
నిఖిల విద్యార్థుల - నెగడొందు వాడు;

విష్ణుశర్మ అనంగ - విప్రుడు కలడు
విష్ణురూపుడ! పిలి - పించు మాయనను.
అప్పగించుము వీరి-నా పండితునకు
చెప్పును చదువెల్ల-శీఘ్రమ్ముగాను."

భూవరుం డా మాట - బుద్ధి పాటించి
వేవేగ రావించె - విష్ణుశర్మాఖ్యు.
సరగున నీతి శా - స్త్రము కుమారులకు
సరియైన రీతిగా - చదివింపు మనియె.

వంద మాన్యమ్ముల - వరుసగా నిత్తు
ముందుగనే అని - ముమ్మాఱు చెప్పె.
ఆలించి ఆ మాట - ఆ విష్ణుశర్మ
ఆలోచనము జేసి - అంతట పలికె:

"ఖండితమ్ముగు మాట - గా చెప్పుచుంటి
మండలాధీశ్వర! - మాన్యాల కొఱకు
చెప్పను విద్యను - చిత్తగించండి.
గొప్పవారల సేతు - కొడుకుల నెట్లొ!

ఆరు మాసాలు నా - కవధి యివ్వండి
భూరి సంభావనల్ - కోరను నేను.
ఎనుబది యేండ్లు నా - కిప్పటి వయసు;
చనెనన్ని కోర్కెలు; - సంపద లేల ?

అడుగుచుంటివి గాన, - ఆరు మాసాలు
గడువిందు నేర్పుదు - మన నీతి నెల్ల
నీ పుత్రులకు విద్య - నేర్పకయున్న
నా పేరు మార్చుకొ - న్నా ననుకొనుడు."

అను విష్ణుశర్మ విం - తయిన ప్రతిజ్ఞ
విని రాజు సంతోష - వివశుడైనాడు.
పండితు డా పయి - పంచతంత్రమ్ము
నిండు గుండెల వ్రాసి - నేర్పించె నీతి.

అన్ని శాస్త్రమ్ముల - నా రీతిగానె
చిన్నవారికి నేర్పె - సెహబాసనంగ!
ఆనాటినుండి ప్ర - ఖ్యాతి వహించె
ఈ నీతి శాస్త్ర మెం - తేని లోకాన.

బాల బాలికలకు - బహు నీతి గతుల
చాలగా నేర్పు నీ - శాస్త్రము వినుడు.
ఈ పంచతంత్రమ్ము - నెవడు పఠించు
ఓపికతో, వాని - కొక కీడు రాదు.





# రాతిమీద పంట

నిజాము రాజ్యంలో ఒక మొఖాసాదారుండేవాడు. అతనికి వివాహమై, భార్య కాపరానికి వచ్చింది. కాని ఆ మొఖాసాదారు అత్తవారిమీద దేనికో అలిగి భార్యతో మాట్లాడేవాడుకూడా కాడు.

చివరకతడి భార్య తన దురవస్థ సంగతి ఇంటి పురోహితుడికి చెప్పుకున్నది. అయన కొంచెం అలోచించి, "అమ్మాయీ, ఈసారి నీ భర్త బయటికి వెళ్ళేటప్పుడు ఒక పని చెయ్యి. నోట పక్క వేసుకుని, చేతిలో అకులు పట్టుకుని, వాకిలికి అడ్డంగా నిలబడు. నీభర్త నిన్ను అడ్డంలెమ్మంటాడు. సున్నంపెడితే లేస్తానను. దానికి అతను ఏమంటాడో నాతో చెప్పు," అన్నాడు.

భార్య అలాగే చేసింది. అమె పక్క వేసుకుని, చేతిలో అకులు పట్టుకుని, వాకిలికి అడ్డంగా నిలబడింది. బయటికి పోతూ భర్త వచ్చాడు. "దారికి అడ్డం లే!" అన్నాడు. "కొంచెం సున్నం పెట్టండి, లేస్తాను," అన్నది భార్య.

"రాతిమీద రాజనాలు పండాలి, బంగారు కొడవళ్ళతో పంట కొయ్యాలి; నేను అడదాని చెప్పులు మొయ్యాలి; ఎర్రచెరువు నీళ్ళు తాగాలి–అప్పుడే నీకు నేను సున్నం పెట్టేది!" అంటూ భర్త అమెను తోసేసి వెళ్ళిపోయాడు. భార్య పురోహితుడితో జరిగినదంతా చెప్పింది.

"ఇంకేమమ్మా? మీ పొలంలో రాతి భూమి ఉన్నదిగా? దానిమీద మోకాలి లోతు మట్టి తోలించి రాజనాలు చల్లించు. పంట అయాక బంగారు కొడవళ్ళు పెట్టి కోత కోయించు," అన్నాడు పురోహితుడు.

భార్య, పురోహితుడి సలహాప్రకారం, రాజనాల పంట వేయించి, అది కోతకు రాగానే, మగవేషంలో గుర్రం ఎక్కి పంట కోసే చోటికి వెళ్ళింది.

కె. రంగనాథరావు

"ఎవరి అనుమతితో ఈ భూమిలో సేద్యం చేస్తున్నారు. ఖామందును పిలవండి. ఈ తప్పుకు వెయ్యిరూపాయలు జరిమానా విధిస్తున్నాం," అన్నదామె కూలీలతో.

వెంటనే ఆమె భర్తకోసం కబురు వెళ్లింది. అతను వచ్చాడు. భార్య అతని మీద మండిపడుతూ, "మేం నవాబుగారి అధికారులం. ఈ పొలంలో పంట పండించటానికి నీకు అనుజ్ఞ ఇచ్చిన గాడిదె ఎవరు? రా, దఫ్తరుకు రా!" అన్నది.

భర్త వణికిపోతూ, కాలినడకను ఆమె గుర్రం వెనకనే బయలుదేరాడు. గుర్రం మీద వున్న భార్య తన కాలి చెప్పులను ఒక్కొక్కటే కింద వదిలింది. అధికారి అసలే ఆగ్రహంగా ఉన్నాడని, భర్త ఆ చెప్పులు తీసి చేతపట్టుకుని గుర్రంవెంట పరిగెత్తాడు. భార్య అతన్ని ఎర్ర చెరువు గట్టుదాకా తీసుకుపోయింది. ఎండలో చాలా దూరం పరిగెత్తివున్న భర్త, దాహం వేసి, చెరువులో నీళ్లు తాగటానికి తన భార్యను అనుమతి వేడాడు.

"సరే, నీళ్ళు తాగి నువ్వింటికి పో! ఈ సారికి నిన్ను క్షమించాం!" అంటూ భార్య గుర్రంమీద ఇల్లు చేరుకున్నది.

తరవాత చాలాసేపటికి భర్త ఇంటికి వచ్చాడు. ఆమె అతనికి భోజనం పెట్టింది. అతను భోజనంచేసి బయటికి పోబోతుండగా, ఆమె పక్క వేసుకుని, చేత ఆకులు పట్టుకుని వాకిలికి అడ్డంగా నిలబడింది.

"దారికి అడ్డంలే!" అన్నాడు భర్త.

"రాతిమీద రాజనాలు పండాయి; బంగారు కొడవళ్ళతో కోశారు; మీరు ఆడదాని చెప్పులు మోశారు; ఎర్రచెరువు నీళ్లు తాగారు. కాస్త సున్నంపెట్టి మరీ వెళ్లండి, తప్పేమీలేదు!" అన్నది భార్య.

భర్తకు జరిగినదంతా అర్థమయింది. అతను చాలా సిగ్గుపడి, ఆ నాటినుంచీ భార్యతో మంచిగా వుండసాగాడు.






## 10

[యుద్ధంలో గాయపడి సమరసేనుడు మరణించినట్టు తెలుసుకున్న శివదత్తుడు, తన అనుచరులతో అడవిలోకి పారిపోయాడుగదా! అక్కడ ఒక కోయగూడెంలో కులపెద్ద అతడికి ఆతిథ్యం యిచ్చాడు. ఆ రాత్రి కోయ గూడేలమీద సైనికులు దాడిచేశారు. వాళ్లల్లో ఒకడు, సుబాహుడనే పేరుగల నరవాహనుడి అనుచరుడి సంగతి చెప్పాడు. తరవాత—]

"మందరదేవా! ఆ శత్రు సైనికుడి మాటలు నన్నూ, కోయ కులపెద్దనూకూడా ఆశ్చర్య చకితులను చేసినై. పరిస్థితులు ఏదో కొత్తమార్గాన కదులుతున్నట్టు నేను అనుమానించాను," అన్నాడు శివదత్తుడు.

మందరదేవుడు తల పంకించి, "మీ ఈ కొత్త అనుభవం నన్నూ ఆశ్చర్యపరుస్తున్నది. తరవాత ఏం జరిగిందో చెప్పండి!" అని అడిగాడు.

"నాతోపాటు ఆ కోయ కులపెద్దకూడా ప్రమాదాన్ని గ్రహించినట్టు కనిపించాడు. అతడు నాకేసి తిరిగి, "ఈ అడవిలో మరెవరి ప్రమేయం లేకుండా, స్వేచ్ఛగా జీవించే మావరకూ, మీ రాజ్యపు అల్లకల్లోలం, గందరగోళం వ్యాపించినట్టు కనబడుతున్నది. ఈ సైనికుడు చెప్పే ఆ సుబాహుడు రాజైన నరవాహనుడికి ఎంతటి సహాయం చేసివున్నా, ఈ విధంగా మా గూడేలమీద పడే హక్కు అతడికి లేదనుకుంటాను!" అంటూ పళ్లు కొరికాడు.

"ఈ రోజుల్లో బలంగల వాడిదే రాజ్యం! మీ కోయలంతా ఐకమత్యంగా ఎదిరించ




మేము కొంత ముందుకు వెళ్ళేసరికి, కత్తులూ కఠార్లతో వున్న అనేకమంది నరవాహనుడి సైనికులు ఒక కోయగూడెంమీద పడి వీరవిహారం చేస్తూండటం కనిపించింది. వాళ్ళు చేతికి అందినదల్లా సర్వనాశనం చేస్తూ, దొరికిన కోయల చేతులకు తాళ్లు బిగించి సోలుపుగా నడుపుకు పోతున్నారు. బహుశా పట్టణాల్లో బానిసలుగా అమ్మేందుకు, వీళ్ల నిలా పట్టుకుపోతున్నారని నా కనిపించింది.

అంతలో కులపెద్ద నాయకత్వంకింద వున్న కోయలు భయంకరంగా అరుస్తూ, నరవాహనుడి సైనికులమీద హఠాత్తుగా పడ్డారు. తమను ఎదిరించేవా ళ్ళిక్కడ ఎవ్వరూ లేరన్న ధీమాతో వున్న ఆ సైనికులంతా, అఠాత్తుగా ఇలా జరిగేసరికి నిబ్బరం కోల్పోయి చెల్లాచెదరు కాసాగారు. కోయలు ఆ సైనికులలో దొరికినవాణ్ణి దొరికినట్టు తమ ఈటెలతో పొడుస్తూ, బానిసలుగా బంధింపబడిన తమ జాతివాళ్ళ కట్లు విప్పి, విజయనాదాలు చేయసాగారు.

ఈ పోరాటంలో నేను నా అనుచరులతో పాల్గొనే అవకాశం చిక్కలేదు. కోయల ధైర్యసాహసాలు నన్ను అశ్చర్యపరిచినై. కొంత శిక్షణా, క్రమపద్ధతీ అనుసరిస్తే, వీళ్ల గలిగితే, కొంత ప్రయోజనం ఉండవచ్చు. అందుకు నాచేతనైన సహాయం చేయగలను," అన్నాను.

కొద్దిసేపట్లో ఆ గూడెంలో ఆయుధం పట్టగలిగిన ప్రతివాడూ, వాళ్ల కులపెద్ద నాయకత్వంకింద, అడవి తగలబడుతున్న ప్రాంతంకేసి బయలుదేరారు. నేనుకూడా నా అనుచరులతో వాళ్ళ వెనకనే బయలుదేరాను. తమ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకు ఎంత ముప్పు వాటిల్లపోతున్నదో ఈ కోయలు గ్రహించగలిగితే—వీళ్ళ సహాయంతో క్రూర నరవాహనుణ్ణి ఒక దెబ్బ తీయవచ్చుని నాకు ఆశ కలిగింది.



సహాయంతో కుండలినీ ద్వీపాన్ని నరవాహనుడి కబంధ హస్తాలనుంచి విముక్తం చేయవచ్చని పించింది.

"ఆ మండుతున్న అడవి ప్రాంతాన్ని అలా వదిలివేయవలసిందేనా? ఆ మంటలు క్రమంగా ఈ ప్రాంతానిక్కూడా వ్యాపించవచ్చు!" అన్నాను కోయ కులపెద్దతో.

అతడు కాలుతున్న అడవికేసి ఓమారు చూసి, "వాటిని ఆర్పటం మానవమాత్రుడి వల్ల కాదు, ముట్టించటం మాత్రం తేలికే. సరే, యిప్పుడు ఒక సంగతి చెప్పండి. నరవాహనుడనే పేరు గల మీ రాజు, మా అరణ్య ప్రాంతాలను ఎవరెవరికో సొంతానికి పంచిపెట్టడమేమిటి? ఒకవేళ యిదే విధంగా, యీ అడవిలోని కోయలమంతా అతణ్ణి ప్రతిఘటిస్తే, అతడు మమ్ములను సర్వనాశనం చేయడానికి ప్రయత్నించగలడా?" అని అడిగాడు.

అలాంటి ప్రశ్నకోసమే ఎదురుచూస్తున్న నేను, కోయ కులపెద్దకు నరవాహనుడి కుటిల రాజనీతి, అందులో అతడికి సహాయపడిన మరి కొందరు ద్రోహుల సంగతీ చెప్పాను. "తనకు సహాయపడిన ద్రోహుల్లో నోరుగల ప్రతివాడికీ, ఏదో ఒక ప్రాంతాన్ని దానంచేసి సంతృప్తిపరచకపోతే, వాళ్ళు




అతణ్ణే హతమారుస్తారు. కనక, అతడు ఈవిధంగా చేయక తప్పదు. మీరీ ప్రమాదాన్నుంచి బయటపడాలంటే, అందరూ ఐక్యంగా అతణ్ణి ఎదిరించాలి. అంతకన్న మరో మార్గం లేదు," అన్నాను.

నా మాటలు విన్న, కోయ కులపెద్ద నాలుగైదు నిమిషాలసేపు ఆలోచిస్తూ ఊరుకుని, తరవాత అక్కడ చేరిన కోయలకేసి తిరిగి, "మీరు అడవి నాలుగు చెరగులకూ ఈ వర్తమానం అందజేయాలి! రేపు సరిగా మిట్టమధ్యాహ్నం వేళ తోడేలుగూడెంలో కులపెద్దలందరూ సమావేశం కావాలి. వాళ్ళు తమ తమ అను



చరుల్ని వెంటబెట్టుకు రావటం మంచిది! వెళ్ళండి!" అంటూ పెద్దగా అరిచాడు.

మరుక్షణంలోనే ఆయుధాలు ధరించిన బలశాలులైన కోయ యువకులు కేకలు పెట్టుకుంటూ అడవి అన్ని దిక్కులకూ పరిగెత్తసాగారు. నేను కోయ కులపెద్ద వెంట తోడేలుగూడెంకేసి బయలు దేరాను.

మేము గూడెం చేరేసరికి బాగా తెల్లవారి పోయింది. దగ్గర్లో అన్ని గూడేలు వుండగా కులపెద్దల సమావేశానికి, ఇంత దూరంలో వున్న యీ తోడేలుగూడేన్ని, వృద్ధుడు యెందుకు యెన్నుకున్నాడో; గూడేన్ని చూచింతరవాత నా కర్థమైంది.

ఈ తోడేలుగూడెం అన్ని కోయగూడేల లాంటిది కాదు. గూడేనికి చుట్టూ ఎత్తయిన మట్టిగోడా, అక్కడక్కడా ఎత్తయిన బురుజులూ కనిపించాయి. గూడెంలో వున్న పెద్ద చెట్లమీద మంచెలూ, అక్కడినుంచి బాణాలు వదిలేందుకు అనువైన స్థావరాలూ ఉన్నాయి. గూడెంమధ్య వున్న బ్రహ్మాండమైన టేకుమాను ఎక్కి చూస్తే—అక్కడికి చుట్టుపట్ల రెండు మూడు మైళ్ళవరకూ అడవిలో ఏం జరుగుతున్నదీ చూడవచ్చు. అదీ యీ గూడెం ప్రత్యేకత!

ప్రొద్దు ఎక్కుతున్నకొందికీ క్రమంగా కులపెద్దలు తమతమ అనుచరులతో



గూడెం చేరసాగారు. ఈ పెద్దల్లో బాగా వృద్ధులూ, యువకులూకూడా వున్నారు. అందరూ పూర్తిగా ఆయుధసన్నద్ధులై వచ్చారు. అందరి ముఖాలమీదా భయం, అదుర్దా స్పష్టంగా కనబడుతోంది.

సరిగా మిట్టమధ్యాహ్నంవేళకు సమావేశ ప్రారంభ సూచనగా పెద్దపెద్ద తప్పెటలు మోగించబడినై. ఊడలు దిగిన ఒక పెద్ద మర్రిచెట్టు కింద పులిచర్మాలూ, జింక చర్మాలూ పరచబడినై. కులపెద్ద లంతా ఒకొక్కక్కళ్లే వచ్చి వాటిమీద కూర్చో సాగారు. నావెంట వున్న వృద్ధుడికి చెట్టు మొదట్లో ఒక ఉన్నతాసనం యివ్వబడింది. నాకూ, నా అనుచరులకూ అతడికి కొంచెం పక్కగా స్థానాలు చూపబడినై.

వివిధ రకాల పండ్లూ, మాంసాలూ, మద్యం అక్కడ చేరినవారి కందరికీ వడ్డించబడినై. అందరూ తృప్తిగా తిన్న తరవాత వృద్ధుడు స్పష్టమైన స్వరంలో సమావేశానికి వాళ్లనందరనూ పిలిచిన కారణం వివరించాడు: "పరిస్థితులు తారు మారైనట్టు కనబడుతున్నవి. ఈ కుండలినీ ద్వీపంలో యీనాటివరకూ ఎన్ని రాజరికాలు మారినా, యీ అడవుల్లో నివసించే మనను అవేమీ బాధించలేదు. తరతరాలనుంచీ యీ వనసంపదను నమ్ముకుని స్వేచ్ఛగా





బ్రతుకుతున్న మనను, యీనాడు రాజరికంలో వచ్చిన మార్పు చీకాకుపరచనున్నట్టు కనబడుతున్నది. గతరాత్రి జరిగిన దారుణసంఘటనలు మీరు చూచేవుంటారు!" అంటూ వృద్ధుడు ముగించాడు.

అప్పుడు సమావేశానికి వచ్చిన కులపెద్దల్లో ఒకరొకరే లేచి వాళ్లవాళ్ల అనుభవాలు వివరించారు. వాళ్లు చెప్పినదానిని బట్టి, మొత్తం అడవిప్రాంతాన్నంతా నరవాహనుడు తన అనుచరముఖ్యులకు బహుమానాలకింద కట్టబెట్టినట్టు నాకర్థమైంది.

ఇప్పుడేం చేయాలి? ఈ ప్రశ్న అక్కడ చేరినవారినందర్నీ కలతపెడుతూనేవుంది.



ఏదో ఒకటి చేయాలని తప్ప—ఆ చేయవలసిందేమిటో చాలామందికి అవగాహన అయినట్టు లేదు. "ఈ అడవి మనది! దీనిమీద హక్కుభుక్తాలన్నీ మనవి!" ఇదీ కొందరి మాటల ధోరణి.

వాళ్ళు చెప్పినదంతా శ్రద్ధగా విన్నతరవాత వృద్ధుడు, "అయితే, ఆ హక్కును నిలబెట్టుకోవటం ఎట్లా?" అని వాళ్లను సూటిగా ప్రశ్నించాడు.

అక్కడ చేరినవాళ్లల్లో చాలామంది యీప్రశ్న విని ముఖముఖాలు చూసుకోసాగారు. కొద్దిసేపు నిశ్శబ్దం తరవాత, ఒక యువకుడు లేచి, "వాళ్లు మనమీద బలప్రయోగం చేసి లొంగతీసుకో దలిచారు. కనుక, మనం మన బలప్రదర్శనంద్వారానే వాళ్ళను ప్రతిఘటించి ఓడించవలసివుంటుంది!" అన్నాడు.

ఈ మాటలకు సమావేశం అన్నిమూలల నుంచీ 'అవును, అవును!' అన్న ప్రతిధ్వనులు వినిపించినై. ఇలాంటి తరుణం కోసమే వేచివున్న వృద్ధుడు తృప్తిగా తల వూపుతూ, "అయితే, కులపెద్దలందరూ తమతమ అనుచరుల్ని వెంటనే పోగుచేయటం మంచిది. శత్రువులు ఒక్కొక్క గూడెంమీద పడి మనను క్రమక్రమంగా







లొంగదీసుకునే అవకాశం యివ్వకూడదు. మనంకూడా వున్న పూర్తిబలంతో శత్రువును ఎదుర్కొని విజయమో, పరాజయమో తేల్చుకోవటం మంచిది!" అన్నాడు.

సమావేశమైన పెద్దలందరికీ అతడి మాటలు నచ్చినై. అంగీకారసూచకంగా అందరూ చప్పట్లు చరిచారు. అప్పుడు వృద్ధుడు, "కాని, మీ అందరి అనుమతితో ముందుగా నేనొక చిన్నపని చేయదలుచుకున్నాను. ఇప్పుడు కుండలినీద్వీపరాజ్యాన్ని హస్తగతం చేసుకున్న ఆ నరవాహన రాజుకు, యీ అడవిప్రాంతంపై తన సైనికులను పంపటం ధర్మం కాదని తెలియపరుస్తాను. దానికి అతడి సమాధానం ఎలా వుంటుందోకూడా చూద్దాం!" అన్నాడు.

ఈ ప్రయత్నానిక్కూడా అందరూ తలలు వూపారు. దానితో సమావేశం పూర్తయింది. మరనాటి సాయంకాలంలోపల కులపెద్దలందరూ తమతమ అనుచరులతో తోడేలు గూడెం చేరేట్టు నిర్ణయం జరిగింది. అడవి మొగదలలో వున్న గూడేలను ఖాళీచేసి, స్త్రీలనూ, పిల్లలనూ బాగా అడవి లోపలి భాగానికి పంపాలని నిశ్చయించుకున్నారు.

అందరూ వెళ్లిపోయింతరవాత వృద్ధుడు నన్ను దగ్గరకు పిలిచి, "మీ అభిప్రాయం ఏమిటి? ఈ వచ్చిన ముఖ్యులందర్నీ చూచారుగదా! వీళ్లు ఆ సైనికుల ధాటికి నిలబడగలరా?" అని అడిగాడు.

"అది యిప్పుడే చెప్పలేం. ఆ నరవాహనుడి సైనికులు సుశిక్షితులు. పైగా, వాళ్లకు అశ్వికబలం వున్నది. మెరుపులా దాడిచేసి అంతలో మాయమైపోగలరు. ఇక, మీది ముఖ్యంగా కాల్బలం. యుద్ధంలో విజయానికి ఒక్క ధైర్యసాహసాలే చాలవు. మీరు కొంత అశ్వికబలాన్నికూడా సమకూర్చగలరా?" అని అడిగాడు.

వృద్ధుడు పెదాలు చప్పరించి, "అది యిప్పట్లో సాధ్యమయే పనికాదు. మా





కోయ యువకుల్లో కొందరు యిప్పుడిప్పుడే అడవిగుర్రాలను మచ్చిక చేసి, వాటికి జీనులూ, కళ్లేలూ లేకుండా స్వారిచేయటం అలవరుచుకుంటున్నారు. జీనులూ అవీ చేసే నేర్పరులైన పనివాళ్లు మాకు లేరు. అవసరం అయితే, కొంత అశ్వికబలాన్ని కూడా సమకూర్చవచ్చు," అన్నాడు.

"అయితే, తప్పక ప్రయత్నించండి. వాటి అవసరం చాలా వుంటుంది!" అని సలహా యిచ్చాను. తరవాత వృద్ధుడు, ఒక యువకుణ్ణి పిలిచి, ఒక జంతుచర్మంమీద పదునైన కత్తిమొనతో ఏదో రాసి, "దీనిని నరవాహన మహారాజుకు చేర్చాలి. నువ్వు నిర్భయంగా ఈ అడవినుంచి మైదానం మీదికి పోవచ్చు. ఏ సైనికుడికి దీనిని చూపించినా, అతడు నిన్ను ఆ రాజుదగ్గరకు తీసుకుపోతాడు. నువ్వుమాత్రం నిరాయుధుడుగా వెళ్ళవలసి వుంటుంది," అని ఆజ్ఞాపించాడు.

వృద్ధుడు పంపుతున్న ఈ లేఖవల్ల ఏమాత్ర ప్రయోజనం కలుగుతుందో చూడాలన్న ఉత్సుకత నాలో కలిగింది. ఒకటి మాత్రం నేను గ్రహించాను; దీనివల్ల పెద్ద వుపయోగం కలుగుతుందని వృద్ధుడుకూడా ఆశిస్తున్నట్టు నాకు కనబడలేదు.

ఆ రాత్రి మేమంతా తోడేలుగూడెంలోనే నిదిరించాం. అడవి కాలుతున్న సూచనగా తెల్లవార్లూ మంటలు కనబడినై. బాగా తెల్లవారిం తరవాత మేం లేచి చూసేసరికి, అప్పటికే వృద్ధుడూ, మరి కొందరు కోయలూ, గూడెం మధ్య వున్న పెద్ద టేకుమానుకింద చేరివున్నారు. నేను అక్కడికి వెళ్లేసరికి మానుపైన వుండి మైదాన ప్రాంతాన్ని పరికించి చూస్తున్న ఒకడు పెద్దగా కేకపెట్టి, "అదుగో మనవాడు వస్తున్నాడు. కాని అదేమిటి, గాడిద మీద కూర్చున్నాడు!" అంటూ ఆశ్చర్యం ప్రకటించాడు. (ఇంకా వుంది)



# ప్రత్యుపకారం



విసుగుచెందని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగి పోయి, మళ్ళీ శవాన్ని దించి భుజాన వేసుకుని, మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవంలో ఉన్న బేతాళుడు, "రాజా, మరొకరి నిమిత్తమై నీవు పడే యాతన చూడగా నాకు చండసింహుడి వృత్తాంతం జ్ఞాపకానికి వస్తున్నది. నీకు మార్గాయాసం తెలియరాకుండా ఉండగలందులకు అతని కథ చెబుతా విను!" అంటూ ఈ కథ చెప్పసాగాడు:

తూర్పుతీరాన గల తామ్రలిప్తి నగరాన్ని ఒకప్పుడు చండసింహుడనే రాజు పరిపాలించాడు. ఆయన తన ఆశ్రితులను ఎంత బాగా చూచేవాడంటే, అనేకమంది రాజకుమారులు ఆయనవద్ద కొలువు చేయటానికి దేశదేశాలనుంచి వచ్చేవారు.

ఈవిధంగా వచ్చిన వారిలో సత్వశీలుడనే దక్షిణదేశపు రాజకుమారుడొక

## బేతాళ కథలు




డున్నాడు. ఇతను కాలం కలిసిరాక రాజ్యభ్రష్టుడై కట్టుబట్టలతో దీర్ఘకాలం ప్రయాణంచేసి, చినిగిపోయిన దుస్తులతో రాజద్వారం చేరాడు. రాజు అతన్ని సామాన్యుడిగా భావించి, నౌకరీలో పెట్టుకున్నాడు.

ఇదికూడా తన దురదృష్టమే అనుకుని సత్యశీలుడు రాజుగారి గుర్రాలను సంరక్షిస్తూ, జీతం బత్తెం అడగకుండా, నిండు పదేళ్లు నౌకరీ చేశాడు.

ఇంతలో ఒకనాడు రాజు సిబ్బందితో సహా వేటకు బయలుదేరాడు. రాజుగారి గుర్రం ముందు పరిగెత్తేపని సత్యశీలుడిదయింది. వేట ఉత్సాహంలో రాజు తన పరివారాన్ని దాటి అడవిలోకి చాలాదూరం వెళ్ళాడు. అప్పటికీ సత్యశీలుడు రాజు గుర్రంముందు పరిగెత్తుతూనే ఉన్నాడు.

అరణ్యమంతా నిర్జనంగా ఉంది. తాను దారి తప్పివచ్చినట్టు గ్రహించాడు రాజు. తన గుర్రం ముందు పరిగెత్తే సత్యశీలుణ్ణి చూసి, "ఏమోయ్! మనం వచ్చిన దారి నీకేమైనా తెలుసా?" అని అడిగాడు.

"తెలుసు, మహారాజా! మిట్టమధ్యాహ్నమయింది! మీరు కాస్సేపు చెట్లనీడను విశ్రమించండి. తరవాత నేను వచ్చిన దారి చూపుతాను," అన్నాడు సత్యశీలుడు.

"నేను ముందు స్నానం చెయ్యాలి. దాహం వేస్తున్నది. ఆకలిగాకూడా ఉంది. ఎలాగ?" అన్నాడు రాజు.

"కొంచెం ఓపికపట్టండి. దగ్గిరలో జలాశయమేదైనా ఉందేమో చూస్తాను," అంటూ సత్యశీలుడు ఒక ఎత్తయిన చెట్టెక్కి చుట్టూ కలయజూసేసరికి, అతనికి కొంతదూరంలో ఒక చిన్న నది కనబడింది. అతను చెట్టు దిగివచ్చి, రాజును నదివద్దకు తీసుకుపోయి స్నానం చేయించి, తన ఉత్తరీయం కొంగునుండి రెండు ఉసిరికపళ్ళు తీసి, "మహారాజా, వీటితో మీ ఆకలి తీర్చుకోండి," అన్నాడు.

రాజు అశ్చర్యపడి, "ఈ పళ్ళు ఇక్కడ ఎలా వచ్చాయి? వీటితో ఆకలి తీరుతుందా?" అని అడిగాడు.

"చిత్తం, తమ కొలువులో ఉన్న పదేళ్లుగా నేను వీటితోనే ఆకలి తీర్చుకుంటున్నాను. నేను వేరే ఆహారం ఎరగను. నావద్ద ఇవి ఎప్పుడూ ఉంటాయి," అన్నాడు సత్యశీలుడు.

సత్యశీలుడి కథంతా విన్నమీదట రాజు అశ్చర్యానికి అంతేలేదు. తనకింద జీతం బత్తెంలేకుండా పదేళ్ళనుంచీ ఇటువంటి బుద్ధిమంతుడు పనిచేస్తూంటే అతని కష్టసుఖాలు తెలుసుకోలేక పోయినందుకు రాజుకు ఎంతో బాధకూడా కలిగింది.

వేటనుంచి తిరిగి రాగానే రాజు నిండు కొలువులో సత్యశీలుడి కథ యావత్తూ చెప్పాడు. అతనికి బోలెడంత ధనమూ, కొంత జాగీరు ఇచ్చాడు. అతన్ని తన అంతరంగిక పరివారంలో ఒకణ్ణిగా నియమించాడు. ఇంతచేసినాకూడా రాజుకు, సత్యశీలుడి రుణం పూర్తిగా తీర్చుకున్నాననే నమ్మకం కలగలేదు.

కొంతకాలం గడిచింది. రాజు వివాహం చేసుకోవటానికి నిశ్చయించు కున్నాడు. సింహళ రాజకుమార్తెను చేసుకుంటే




అన్నివిధాలా బాగుంటుందని మంత్రులు సలహా ఇచ్చారు. పెళ్ళివిషయాలు మాట్లాడి రావటానికి రాజు సత్యశీలుణ్ణి సింహళానికి ఓడలో ప్రయాణంకట్టి పంపించాడు. రాజపురోహితులతోసహా సత్యశీలుడు సముద్రమధ్యం చేరేసరికి ఒక వింత జగిరింది.

ఓడపోయే మార్గానికి అడ్డంగా, సముద్రం అడుగునుంచి ఒక బంగారు ధ్వజం ఆకాశం ఎత్తు లేచింది. అదే సమయాన సముద్రం మీద హోరు గాలితో సహా తుఫాను చెలరేగింది. గాలికి, ఓడ ధ్వజానికి వెళ్ళికొట్టుకుని మునిగి పోసాగింది. ఓడలో జనం హాహాకారాలు చేశారు.



తన ప్రయాణానికి సముద్రుడీవిధంగా విఘ్నంకలిగిస్తాడా అని సత్వశీలుడికి పట్టరాని ఆగ్రహం వచ్చింది. అతను కత్తిదూసి సముద్రంలోకి దూకేశాడు. ఎంతలోతుకు పోయినా అతనికి సముద్రుడు కనిపించలేదు, కాని అట్టడుగున అందమైన తోటలూ, ఒక పార్వతీ ఆలయమూ కనిపించాయి.

సత్వశీలుడా ఆలయం ప్రవేశించి దేవికి నమస్కారంచేసి కూచున్నాడో లేదో, ఆక్షణంలోనే అక్కడికి అద్భుత సౌందర్యవతి అయిన ఒక స్త్రీ వచ్చింది. ఆమె వెంట వెయ్యిమంది చెలికత్తెలున్నారు. ఆ వచ్చిన స్త్రీ సత్వశీలుడికేసి చూడనైనా చూడకుండా దేవిని ఆరాధించి తన చెలికత్తెలతోసహా బయలుదేరింది. ఆమెను చూస్తూనే ప్రేమించిన సత్వశీలుడు వెర్రివాడిలాగా ఆమెవెనకనే బయలుదేరాడు.

ఆ స్త్రీలంతా పోయి పోయి ఒక నగరం చేరారు. ఒక రాజభవనంలో వారందరూ కొలువుతీరి కూర్చున్నారు. సత్వశీలుడు తాను ప్రేమించిన కన్యకు సమీపంలోనే కూచుని ఒళ్ళంతా కళ్ళుచేసుకుని ఆమెను చూడసాగాడు. అతన్ని కాస్సేపు భరించిన మీదట ఆ స్త్రీ తన చెలికత్తెలకు ఏదో సంజ్ఞచేసింది. వెంటనే ఒక చెలికత్తె సత్వశీలుడివద్దకు వచ్చి, "స్వామీ, మీరెవరో! మాకు అతిథులుగా వచ్చారు. భోజనానికి వేళకావచ్చింది. సమీపంలోనే కొలనున్నది. అందులో స్నానంచేసి వేగిరం రండి!" అని మర్యాద చేసింది.

సత్వశీలుడు పరమానందం చెందినవాడై, కొలనుకువెళ్ళి అందులో స్నానం చెయ్యటానికి దిగాడు. మరుక్షణం అతను తామ్రలిప్తి నగరంలోని తోటబావిలో తేలాడు. రాజభటు లతన్ని గుర్తించి రాజు దగ్గిరికి తీసుకుపోయారు.

సత్వశీలుడి అనుభవాలన్నీ విన్నాక రాజుకు తన ఓడ మునిగిపోయిందనిగాని,

తన పెళ్ళియత్నాలు భగ్నమయాయనిగాని విచారం కలగలేదు, సత్యశీలుడి ఋణం తీర్చుకునేటందుకు అవకాశం దొరికిందని సంతోషం కలిగింది. ఆయన సత్యశీలుడితో, "నువ్వేంతమాత్రమూ విచారించవద్దు. నువు ప్రేమించిన సుందరి నిన్ను పెళ్ళాడేటట్టు నేను చూస్తాను. మనం వెంటనే ప్రయాణమై ఆ సముద్రం దారినే వెళదాం!" అన్నాడు.

ఈసారికూడా నావకు అడ్డంగా సముద్రంలోనుంచి బంగారు ధ్వజస్తంభం లేచింది. అది కనిపించగానే సత్యశీలుడూ, అతని వెనకనే రాజూ సముద్రంలోకి దూకారు. కొద్దిసేపట్లో వారు పార్వతీదేవి అలయం వద్ద నేలతాకారు. వారు దేవికి నమస్కారంచేసి బయటికి వచ్చే అంతలో పూర్వంలాగే ఆ సుందరి తన సఖీజనంతో సహా అలయానికి వచ్చింది. ఆమె రాజుకేసి ఒకసారి చూసి లోపలికి వెళ్ళింది.

రాజు ఆమెకోసం వేచిఉండక సత్యశీలుణ్ణి తీసుకుని చుట్టుపక్కల ఉండే ఉద్యానవనాలలోకి వెళ్ళిపోయాడు. ఆ కన్య అలయంలో దేవీపూజ ముగించి బయటికి వచ్చి రాజుకోసం చూసింది. అతను కనిపించక పోయేసరికి ఒక చెలి




కత్తెను పిలిచి, "ఇంతకుపూర్వం మనకు కనిపించిన మహారాజును ఎక్కడ వున్నాడో వెతికి, మన ఇంటికి ఆతిథ్యానికి పిలుచుకురావే!" అని పంపించింది.

ఆ చెలికత్తె ఉద్యానవనాలన్నీ తిరిగి రాజును చేరుకుని, "మహాప్రభూ! మా యజమానురాలు ఆతిథ్యానికి రమ్మన్నది, దయచెయ్యండి!" అని ప్రార్థించింది.

"ఈ పిలుపే సమస్తోపచారాలూ! వేరే ఆతిథ్యం అవసరంలేదు," అన్నాడు రాజు.

రాజు ఇలా అన్నట్టు చెలికత్తె చెప్పగానే ఆ కన్య స్వయంగా బయలుదేరి వచ్చి ఆయనను ఆహ్వానించింది.

"నా మిత్రుడికి మీరిచ్చిన ఆతిథ్యం గురించి విన్నాను. నాకు అలాటి ఆతిథ్యంతో పనిలేదు," అన్నాడు రాజు.

"స్వామీ, తమరు గొప్పవారు. తమ వంటివారిదగ్గిర అలా ఎందుకు చేస్తాను? మీరు తప్పక దయచెయ్యాలి," అన్నదామె.

రాజు సత్వశీలుడితోసహా ఆమెవెంట వెళ్ళాడు. ఆమె వారికి తగిన మర్యాదలన్నీ చేసి, రాజుతో, "స్వామీ, నేను కాలనేమి అనే దైత్యరాజు కుమార్తెను. విశ్వకర్మ నా తండ్రికొరకు ఈ మహానగరాన్ని ఇక్కడ నిర్మించాడు. ఈ నగరంలో ముసలితనమూ, చావూ ఉండవు. నా తండ్రి ఈ నగరం విడిచి పోవటంచేతనే విష్ణుమూర్తి చేత చంపబడ్డాడు. ఆయన పోయినతరవాత నేనే ఈ నగరానికి ఏలికగా ఉంటున్నాను. తమవంటి పెద్దలు యిక్కడ అడుగుపెట్టటం ఇదే మొదలు! మీరేది ఆజ్ఞాపిస్తే అది చెయ్యటానికి సిద్ధంగా ఉన్నాను," అన్నది.

"అయితే నా మిత్రుణ్ణి ఇప్పుడే వివాహ మాడు," అన్నాడు రాజు. ఆమె ఒప్పుకున్నది. వారిద్దరికీ పెళ్ళిచేసేసి రాజు సత్వశీలుడితో, "నేను నీదగ్గిర రెండు ఉసిరిక పళ్ళు తిన్నాను. అందులో ఒక్క పండు రుణం తీరలేదు," అని చెప్పి, సమీపంలో వున్నకొలనులో దూకి తన నగరం చేరాడు.

ఈ కథ చెప్పి బేతాళుడు, "రాజా! చండసింహుడూ, సత్వశీలుడూ, ఇద్దరూ కూడా సాహసించి సముద్రంలో దూకారు గదా? ఇద్దరిలో ఎవరిసాహసం గొప్పది?" అని అడిగాడు.

"సత్వశీలుడి సాహసమే గొప్పది. సముద్రంలో దూకితే ఏమవుతుందో తెలియకుండానే అతను దూకాడు. ఏమయేదీ తెలిసి దూకినవాడు రాజు!" అని విక్రమార్కుడు జవాబిచ్చాడు.

రాజుకు మౌనభంగంకాగానే బేతాళుడు శవంతోసహా మాయమై చెట్టెక్కాడు.






# తల్లీ కూతుళ్ళు

4

ఇంతకూ అహ్మద్ అదృష్టం బాగాలేదు. కొంచెందూరం పోయేసరికల్లా అతనికి హసన్ ఎదురై, అమాయకంగా, "ఇదేమిటి, అహ్మద్? ఈ చలిగాలిలో ఇటువంటి దుస్తులతో తిరగటం ఆరోగ్యానికి మంచిదా?" అని అడిగాడు.

"విధి ఎంతవారికీ తప్పదుగదా, హసన్! నన్నొకబాలిక మోసగించింది. నువ్వేమైనా దానిజాడ ఎరుగుదువా?" అన్నాడు అహ్మద్, ఎంతో దీనంగా.

"ఆ పిల్లనూ ఎరుగుదును, దాని తల్లినీ ఎరుగుదును. వెళ్ళి పట్టుకోమంటావా?" అని అడిగాడు హసన్.

"అదెట్లా వీలవుతుందీ?" అన్నాడు అహ్మద్ ఆశ్చర్యంగా.

"దానికేముందీ? ఖలీఫా పద్దకు పోయి నీవల్ల కాదని చెప్పు. ఆ పని నాకు పురమాయించమని ఖలీఫాను వేడుకో," అని హసన్ సలహ ఇచ్చాడు.

అహ్మద్ అలాగే చేశాడు. ఖలీఫా హసన్‌ను పిలిపించి, "నీకీ ముసలిది తెలుసునా? ఆ పని నీకు ఒప్పచెప్పితే, దాన్ని పట్టుకురాగలవా?" అని అడిగాడు.

"నేనా ముసలిదాన్ని ఎరుగుదును. అది ధనలోభంతో ఈ దొంగతనాలు చేసిందనుకోను. తన ప్రతాపం విలినవారికి చూపటానికే ఇలా చేసి ఉండాలి. అది దొంగిలించిన సొత్తంతా తిరిగి ఇచ్చేషరతుపై ముందుగా దానికి తమరు అభయం ఇచ్చే పక్షాన దాన్ని తీసుకువచ్చి మీ ఎదట పెట్టగలను," అన్నాడు హసన్.

ఖలీఫా అభయం ఇచ్చాడు. హసన్ నేరుగా దిలైలా ఇంటికి వెళ్లాడు. అతనికి జీనాబ్ తలుపు తెరిచింది. "మీ అమ్మను

ఎస్. వెంకటసుబ్బయ్య

రమ్మను. ఖలీఫా పిలుస్తున్నారు. ఆయన వద్ద అభయం తెచ్చాను. మీ అమ్మ ఎత్తుకొచ్చిన సామానంతా గుర్రాల మీదికి ఎత్తించు," అన్నాడు హసన్.

దిలైలా మేడదిగి వచ్చింది. ఆమె దొంగిలించిన సామానంతా గుర్రాలమీద వేయించారు. దిలైలా ఉన్నవాటిలో మంచి దుస్తులు ధరించి ఖలీఫా దర్శనం చేసుకోవటానికి సిద్ధమయింది.

"నీదగ్గిరవున్న సామానంతా వచ్చిందా?" అన్నాడు హసన్.

"అహ్మద్, అతని భటులూ వేసుకున్న దుస్తులుతప్ప అంతా ఇచ్చేశాను. నిజం చెపుతున్నాను, ఆ దొంగతనంతో నాకేమీ సంబంధంలేదు," అన్నది దిలైలా.

"అవును, అది మరొకరి పని," అన్నాడు హసన్ నవ్వుతూ. ఇద్దరూ బయలుదేరి దర్బారుకు వచ్చారు.

ముసలిదాన్ని చూస్తూనే ఖలీఫా ఆగ్రహావేశంతో తన భటులకు ఆమె తల నరకమని ఉత్తరు విచ్చాడు. కాని హసన్ సవినయంగా అభయంమాట జ్ఞాపకం చేసిన మీదట ఖలీఫా, "నీ పేరేమిటి?" అని దిలైలాను అడిగాడు.

"పావురాలటపా నడిపిన అధికారి భార్యను. నా పేరు దిలైలా," అన్నది దిలైలా.



"నువు చాలా సమర్థురాలివిగా కని పిస్తున్నావు! వీరినందర్నీ ఎందుకు మోసం చేశావు?" అన్నాడు ఖలీఫా.

దిలైలా ఖలీఫా ముందు సాష్టాంగపడి, "ఏలినవారు మన్నించాలి. నేను ధనాశ చేత దొంగతనాలు చేయలేదు. చౌర్యంలో ఘటికులైన అహ్మద్, హసన్‌లకు ఏలిన వారు పెద్ద పదవులిచ్చారని విని, నేను వారికన్న ఎక్కువ శక్తులు చూపినట్టయితే నా భర్త చేస్తూ ఉండిన పనిని నాకు దయ చేయిస్తారేమో ననుకున్నాను," అన్నది.

ఖలీఫాకు దిలైలా చెప్పినదాంట్లో నిజం వున్నట్లు తోచింది. అతడు ఫిర్యాదీలకు వారి సొత్తు ఇప్పించి దిలైలాతో, "ఇప్పుడు నువు కోరేదేమిటో కోరు," అన్నాడు.

"ఏలినవారు నాకు నా భర్త చేసిన ఉద్యోగమూ, జీతమూ దయచేయించాలి. నాకా పని పూర్తిగా తెలుసు. నేనూ, నా కుమార్తె కలిసి పావురాలను సాకేవాళ్ళం. వాటికి ఉత్తరాలు కట్టేవాళ్ళం. పావురాల పోస్టునిమిత్తం ఏలినవారు పెద్ద దివాణం కట్టించి దానికి నలభైమంది నీగ్రో బానిస లతో, నలభై వేటకుక్కలతో కాపలా ఏర్పాటు చేయించారు. ఆ దివాణాన్ని నిర్వహించినది నేనుతప్ప నా భర్త కాదు," అని దిలైలా మనవి చేసుకున్నది.






ఖలీఫా వెంటనే అజ్ఞాపత్రం తయారు చేయించి దిలైలాను పావురాలటపా నిర్వాహకురాలుగా నియమించాడు. నీగ్రోలనూ, వేటకుక్కలనూ ఆమెపరం చేయించాడు.

దిలైలా తన ఇంటి సామానంతా పావురాలటపా దివాణానికి తరలించింది. ఆరోజే ఆమె మగదుస్తులు ధరించి, నెత్తిన వెండి పావురం గల బంగారు టోపీ ధరించి, టపా చేయవలసిన సందేశాలు తీసుకురావటానికి రాజభవనానికి వెళ్ళింది. నలభైమంది నీగ్రోలకూ ఎర్రని జరీదుస్తులు ఏర్పాటుచేసింది. తన కొత్త భవనంలో అలంకారంగా ఉండగలందులకు నలభైఒక్క మేకు కొట్టించి వాటికి అహ్మద్ దుస్తులూ, గూని అలీ దుస్తులూ, మిగిలిన ముప్పైతొమ్మిది భటుల దుస్తులూ వేలగట్టింది. ఈ విధంగా దిలైలా తన పంతం నెగ్గించుకుని, తన కుమార్తె జీనాబ్‌తో సుఖంగా బ్రతకసాగింది.

ఇది జరిగిన కొద్దికాలానికి కైరో నగరం నుంచి, "పాదరసం" అనే సార్థక నామం గల యువకుడొకడు బగ్దాద్ నగరానికి చేరుకున్నాడు. ఇతని అసలు పేరు అలీ. చాలా అందగాడు కాని గజదొంగ. ఇతని స్వస్థలం కైరో. ప్రస్తుతం కొత్వాలుగా ఉంటున్న అహ్మద్ కైరో నగరంలో పేరుమోసిన దొంగగా ఉండినప్పుడు "పాదరసం" అతని వద్దనే చోరవిద్య నేర్చుకున్నాడు. అహ్మద్ బగ్దాద్‌కు వచ్చి, అక్కడకూడా దొంగగా కీర్తి సంపాదించుకుని కొత్వాలు పదవి సంపాదించిన కాలంలో కైరోలో ఈ "పాదరసం" దొంగల నాయకుడుగా ఉంటూ వచ్చాడు. అతను ఎన్నోసార్లు పట్టుబడి కూడా తప్పించుకు పోవటంచేత అతన్ని ప్రజలు, "పాదరసం" అని పిలవసాగారు.

"పాదరసం" అలీని, అహ్మదే బగ్దాద్‌కు పిలిపించాడు. దిలైలా విషయంలో పరాభవం తిన్ననాటినుంచీ అహ్మద్‌కు ప్రతిక్షణమూ "పాదరసం" జ్ఞాపకం రాసాగాడు.

వాడు తనకు కుడి భుజంలాటివాడు. వాడే తన పక్కన వుంటే తనకి పరాభవం జరిగేదికాదనుకున్నాడు అహ్మద్. అదీగాక ఇప్పుడు అహ్మద్, దిలైలా మీద స్వయంగా పగతీర్చుకోవటానికి లేదు. ఇప్పుడామెకు తనకున్నంత హెూదా వున్నది. కనుక, అందుకు పాదరసమే సరిఅయినవాడు.

"పాదరసం" అలీ బగ్దాద్ నగరం చేరి నేరుగా అహ్మద్ యింటికి వెళ్ళాడు. అహ్మద్‌కు అతన్ని చూడగానే ప్రాణం లేచి వచ్చింది. "తమ్ముడూ, నా యింట కొంత కాలం రహస్యంగా ఉన్నట్టయితే నీతో ఒక పని ఉంది. ఆ పని అయినాక నిన్ను బహిరంగంగా ఖలీఫాదగ్గిరికి తీసుకుపోయి శిఫార్సుచేసి మంచి ఉద్యోగం ఇప్పిస్తాను," అన్నాడు అహ్మద్ పాదరసంతో.

పాదరసం, అహ్మద్ ఇంట రెండురోజులు గడిపాడు. ఆ తరవాత అతనికి ఇల్లు ఖైదు లాగా తోచింది. మూడోనాడు అహ్మద్ దివాణానికి వెళ్ళిపోగానే, "పాదరసం" ఇంటి నుంచి బయటికి జారుకున్నాడు. అతని ఉద్దేశం బగ్దాద్‌నగరం నాలుగుమూలలూ తిరిగి చూసి వద్దామని.

అతను కొద్ది దూరం వెళ్ళాడో లేదో అతనికి మగదుస్తులు ధరించి, నెత్తిన వెండి



పావురంగల బంగారు టోపీ పెట్టుకుని గుర్రం మీద పోతూ ఒక ముసలిదీ, ఆమెవెంట ఎర్రజలతారు దుస్తులు ధరించిన నలభై మంది నీగ్రోలూ కనిపించారు. వారెవరో కాదు, దిలైలా, ఆమె నౌకర్లూనూ. దిలైలా ఆ ఉదయం దివాణానికి వెళ్ళి టపా చేయవలసిన వార్తలు పోగుచేసుకుని తన ఇంటికి తిరిగి పోతున్నది.

దిలైలా, "పాదరసం" అలీ కొత్తముఖం చూసి అతని అందానికి ఆశ్చర్యపడింది. కాని ఆమె కళ్లకు అతని ముఖంలో తన శత్రువైన అహ్మద్ కవళికలు కొన్ని కనిపించాయి. నిజానికి అహ్మద్ శిష్యత్వం

చేయటంలో అలీ అతని చూపూ, ముఖ భంగిమలూ తెలియకుండానే అలవరుచుకున్నాడు. అలీ, అహ్మద్ ఇంటి వైపునుంచే వస్తూండటంకూడా దిలైలా పసికట్టింది.

ఆమె యింటికి పోతూనే తన కుమార్తె జీనాబ్‌కు తాను చూసిన యువకుణ్ణి వర్ణించి చెప్పి, "అహ్మద్ ఈ యువకుణ్ణి పిలిపించాడని నాకు తోస్తున్నది. వాడు వీధులు వింతగా పరీక్షించటం చూస్తే యివాళో, నిన్ననో వచ్చాడని పిస్తున్నది. మనం చాలా జాగ్రత్తమీద ఉండాలి!" అన్నది.

జీనాబ్ తల్లి చెప్పినదంతా విని, కొంచెం సేపు ఆలోచించి, "ఏమిటమ్మా? హేమాహేమీలను లక్ష్యపెట్టనిదానివి, గడ్డాలూ, మీసాలూ సరిగా రాని ఈ కుర్రాడికి దడుస్తావేమిటి?" అన్నది. ఆమె అందమైన దుస్తులు వేసుకుని, కళ్లకు కొసగా కాటుకదిద్ది, మేలిముసుగు వేసుకుని, చేత సంచీ పట్టుకుని, నడిచే మెరుపుతీగెలాగా వీధిలోకి వెళ్ళింది.

ఆమె మెల్లిగా నడుచుకుంటూ కొంత దూరం వెళ్ళాక ఒక దుకాణం దగ్గిర "పాదరసం" కనిపించాడు. తల్లి చెప్పిన వర్ణనుబట్టి అతన్ని గుర్తుపట్టి జీనాబ్ ఆతన్ని తోసుకుంటూ వెళ్లి వెనక్కు తిరిగి, "కళ్లులేని కబోది!" అన్నది కోపంగా.



"పాదరసం" ఆమెను చూసి ఆమె అందానికి ఎంతగానో ఆశ్చర్యపోయాడు. అతను నవ్వుతూ, "ఆహా, ఎంత అందం! ఎవరిదానివి?" అన్నాడు.

"నేనొక వర్తకుడి కుమార్తెను, ఇంకో వర్తకుడి భార్యను. మీ ధోరణి చూస్తే ఈ వూరికి కొత్తలాగుంది. మీబస ఎక్కడ?" అని అడిగింది జీనాబ్.

అహ్మద్ విషయం రహస్యంగా ఉంచాలనే ఉద్దేశంతో పాదరసం, "ఇంకా బసలేదు. ఎక్కడన్నా చూడాలి," అన్నాడు.

"అయితే మాయింటికి రండి. మాది చాలా పెద్ద ఇల్లు. నాభర్త దుకాణానికిపోతే ఇంటిదగ్గిర నాకు తోడెవ్వరూ ఉండరు," అన్నది జీనాబ్.

ఆమెవెంట వెళ్లటం క్షేమంకాదేమోనని "పాదరసం" శంకించాడు. కాని, తనను ఈ నగరంలో ఎవరూ ఎరగరు గనకనూ, ఈ పిల్ల తనకు శత్రువై ఉండే అవకాశం ఏమీ కనిపించలేదు గనకనూ ఆమెవెంట వెళ్ళి ఆమె ఎటువంటిదో తెలుసుకోవాలని అతను నిశ్చయించుకున్నాడు.

జీనాబ్ అతన్ని వీధులు తిప్పి ఒక పెద్ద యింటిముందుకు తీసుకొచ్చి, తాళపుచెవి కోసం సంచీలో వెతకనారంభించింది. ఆ ఇల్లు ఒక గొప్ప వర్తకుడిది. ప్రస్తుతం



ఇంట ఎవరూలేరు. వర్తకుడు ఉదయమే ఇల్లు తాళంవేసుకుని దుకాణానికి వెళ్ళిపోయి, రాత్రివాకా తిరిగి రాడు. ఆ సంగతి జీనాబ్‌కు తెలుసు.

"అయ్యో, తాళంచెవి కాస్తా ఎక్కడో పడిపోయింది. ఇప్పుడు ఏంచెయ్యాలి? మీరేమైనా తాళం తీయగలరా?" అని జీనాబ్ పాదరసాన్ని అడిగింది.

"చూస్తాను," అంటూ పాదరసం అంత పెద్ద కప్పతాళాన్ని ఇట్టె తీసేశాడు. అతను నిజంగా సమర్థుడైన దొంగేనని జీనాబ్‌కు రూఢి అయిపోయింది.

ఇద్దరూ లోపలికి వెళ్ళారు. "మీరు హాలులో కూచోండి. నేను బావిలో నీళ్లు చేది వంటచేస్తాను," అంటూ జీనాబ్ బిందె తీసుకుని దొడ్లోకి వెళ్ళింది.

కాస్సేపటికి బావివద్దనుంచి జీనాబ్ కెవ్వున కేకపెట్టింది. ఏంజరిగిందోనని పాదరసం పరుగెత్తుకుంటూ అక్కడికి వెళ్లేసరికి ఆమె బావిలోకి చేదవేసి లోపలికి తొంగి చూస్తూ కనపడింది.

"ఏంజరిగింది?" అని అడిగాడు పాదరసం ఆదుర్దాగా.

"నా రవ్వల ఉంగరం! అయిదు వందల దీనారాలుపోసి నిన్ననే నాభర్త కొన్నాడు. వొదులుగా ఉందని అప్పుడే చెప్పాను. అది కాస్తా బావిలో పడిపోయింది. నాభర్తకు తెలిస్తే చంపేస్తాడు!" అని జీనాబ్ విలవిలలాడింది

"నీకేం భయంవద్దు! నేను దిగితీస్తాను," అంటూ పాదరసం అడ్డదూలానికి మోకు కట్టి దాని సహాయంతో బావిలోకి దిగాడు. అతను మోకు వదలి నీళ్లలో మునగగానే జీనాబ్ మోకు పైకి లాగేసి, "నిన్ను అహ్మద్ పైకి తీస్తాడులే! అందాకా అందులోనే ఉండు!" అంటూ అతని దుస్తులతో సహా ఇంటికి వెళ్లిపోయింది.

(ఇంకా వుంది)



# పురాతన మానవులు

సుమారు 10 లక్షల ఏళ్ళక్రితం భూమిపై మానవుడు అవతరించాడు. స్తనజాతి జంతువులలో ఒక శాఖకు "ప్రైమేట్స్" అని పేరు. ఈ జంతువుల కాళ్ళకూ, చేతులకూ అయిదేసి వేళ్ళుంటాయి; వీటి మెదడులు అభివృద్ధి అయివుంటాయి; వీటి శరీరాలలో విస్తరించిన నరమండలం వుంటుంది. నశించిపోయిన ఒక రకమయిన "ప్రైమేట్స్"నుంచి మనిషి పరిణమించాడు. మనిషిని "హోమోసేపియన్స్" (తెలివి గల వాడు) అంటారు.

సృష్టిలో నిటారుగా నిలబడగలిగిన జంతువు మనిషి ఒకడే. ఇందుచేత అతని చేతులకు స్వాతంత్ర్యం లభించి, వాటితో అతను వస్తువులను పట్టుకోవటమూ, తయారుచేసుకోవటమూ, ఉపయోగించుకోవటమూ నేర్చాడు. మనిషి శరీరంతో పోలిస్తే మనిషి మెదడు గొరిల్లా మెదడుకన్న అరింతలు గొప్పది. సృష్టిలో మనిషి తరవాత తెలివైనది గొరిల్లాయే. రకరకాల కోతులూ, కొండముచ్చులూ "ప్రైమేట్స్" శాఖకు చెందినవి. అవి మానవుడికి సన్నిహితమైన జాతులు. 3 కోట్ల ఏళ్ళక్రితం నివసించిన ఒక జాతి జంతువులనుంచి కొండముచ్చులు ఒక శాఖగానూ, మానవులు మరొక శాఖగానూ అవతరించినట్టు శాస్త్రజ్ఞులు చెబుతున్నారు. 3 కోట్ల ఏళ్ళక్రితం భూమియొక్క స్వరూపంలో గొప్ప మార్పు జరిగింది. సమశీతోష్ణంగా వున్న వాతావరణం పూర్తిగా చల్లబడిపోయింది. అంతవరకూ పుష్కలంగా వుండిన అరణ్యాలు ఒక్కసారిగా నశించిపోయాయి. నేలమీద నడిచి ఫల వృక్షాలకోసం వెతుక్కుంటూ పోగలిగిన "ప్రైమేట్స్" మాత్రమే దక్కాయి. 2 కోట్ల ఏళ్ళపాటు ఇవి పరిణామం చెందినమీదట ఈ జంతువుల మధ్య మనిషి ఛాయలు గల జాతి ఒకటి బయలుదేరింది. అది నిలబడి నడిచింది. దాని మెదడు గొరిల్లా మెదడుకన్న అటే ఘనమైనది కాదు; కాని దంతాలూ, అవయవాలు గొరిల్లానుకంటె మనిషినే ఎక్కువ పోలి ఉన్నాయి.

క్రమంగా ఈ జంతువు శరీరప్రమాణం పెరగసాగింది. మెదడులో మాత్రం పరిణామం జరగలేదు. చిట్టచివరకు 10 లక్షల, 5 న్నర లక్షల ఏళ్ళకు మధ్యకాలంకిందట పురాతన మానవుడు పుట్టాడు. ఇతని పేరు "పిథికన్‌త్రోపస్". "పిథికన్‌త్రోపస్" 4 లక్షల ఏళ్ళక్రితం అంతరించిపోయాడు. అతని స్థానే "సినన్‌త్రోపస్" వచ్చాడు. ఇతనినే "పీకింగ్ మనిషి" అంటారు. ఈ మనిషికి చెప్పుకోదగిన నుదురుగాని, గడ్డంగాని లేదు. మామూలు మనిషి మెదడుతో పోలిస్తే ఇతని మెదడు మూడింట రెండు వంతులు మాత్రమే. కాని ఇతనిలో మానవ లక్షణాలన్నీ ప్రస్ఫుటంగా ఉన్నాయి.

ఇలాటి ప్రాణులనుంచి తెలివి పరిణామం చెందింది. ఈనాటి నాగరికతను సాధించటానికి మానవుడు అంతులేని కృషి చేశాడు. మానవుడు భూమిమీద కన్ను తెరిచినది లగాయతు ఈనాటివరకూ జరిగిన కాలంలో నూరింట 99 వంతులు రాతియుగంలోనే గడిచింది. ఆ యుగంలో మానవుడు అనాగరిక జీవిగా జీవించాడు. దీనిని బట్టి నాగరికత కోసం జరిగినది యెంత దీర్ఘకృషి అయినదీ మనం ఊహించవచ్చు.



# పుణ్యాత్ముడు

ఒక గ్రామంలో కనకయ్యా, కాంతయ్యా అని ఇద్దరు వృద్ధులుండేవారు. కనకయ్య ఇంత కలవాడు. అయనకు ఇరవై ఎకరాల పొలమూ, బోలెడన్ని పశువులూ, పెద్దలోగిలీ ఉన్నాయి. కాంతయ్య అయిదా రెకరాలు గల సామాన్యపు రైతు. అయినా వాళ్లిద్దరూ అన్న దమ్ముల్లాగా ఉంటూండేవారు.

ఎప్పటికైనా కాశీకి వెళ్లి విశ్వేశ్వరుడి దర్శనం చేసుకోవాలని వారిద్దరూ అనుకున్నారు. కాశీప్రయాణానికి కాంతయ్య ఎప్పుడూ సిద్ధంగానే ఉన్నాడుగాని కనకయ్యకు ఎప్పటికప్పుడు ఏదో అవాంతరం వచ్చేది. ఒక ఏడు ఇంటి ముందుభాగాన మిద్దె వేయించాడు. ఇంకో ఏడు గొడ్లసావిడి పెద్దది చేయించటం పెట్టుకున్నాడు.

"ఏం, కనకయ్యా? ఈ యేడన్నా కాశీ వెళ్ళేది ఉందా, లేదా? నీదే తాత్సారం!" అన్నాడు కాంతయ్య.

"పోదాం, లేరా! కాస్త డబ్బూ అదీ చూసుకోనీ! వందరూపాయలన్నా చేతిలో లేకుండా ఎట్లా బయలుదేరతాం? నువు మాత్రం ఉన్నపాటున ఎక్కడ పుట్టిస్తావు?" అన్నాడు కనకయ్య.

"నువు రేపు బయలుదేరుతానను, నేను డబ్బు తెస్తాను! నాకన్న మోతుబరివై ఉండి నువుకూడా అట్లా మాట్లాడతావేం?" అన్నాడు కాంతయ్య.

కాంతయ్య పోరుపడలేక కనకయ్య ఆయేడు కాశీప్రయాణం పెట్టాడు. నెల రోజులపాటు తన వ్యవహారాలన్నీ తన కొడుకుకు వప్పగించి, తాను లేని సమయంలో పొలంపనులూ, దొడ్డిపనులూ, ధాన్యం అమ్మకాలూ ఎట్లా చెయ్యాలో, ఏ పొలంలో ఏం చల్లాలో, ఎంత ధాన్యం ఎప్పుడు ఎట్లా నిలవచెయ్యాలో, శిస్తులూ అవీ ఎంతెంత ఇవ్వాలో కొడుకుకు వైనంగా

జి. కాంతారావు

తెలియపరచి, అందరికీ అంపకాలు చెప్పి సుముహూర్తాన బయలుదేరాడు.

కాంతయ్యమటుకు తనకున్న రెండు పశువులనూ కోమటికమ్మి, మిగతాది పంటలోనుంచి ఇచ్చేటట్టు ఏర్పాటుచేసి నూరురూపాయలు తీసుకున్నాడు. తన కొడుకును పిలిచి, "ఒరే, నాయనా, నీకు తెలీనిదేముంది? ఇవాళ కాకపోతే రేపైనా నువు నా సహాయంలేకుండా కాడిమొయ్యాలి సిందే. కనక ఇల్లూ, వాకిలీ చక్కగా చూసుకో!" అన్నాడు.

ఇద్దరూ కలిసి కాశీకి బయలుదేరారు. నెలరోజులపాటు ప్రయాణం సుఖంగానే జరిగిపోయింది. వాళ్ళు మజిలీచేసిన చోట నల్లా సత్రాలలోనూ, గృహస్థుల ఇళ్లలోనూ ఆతిథ్యం దొరికింది. కాశీయాత్రీకులని ఆద రించి అనేకమంది వాళ్లకు బట్టలుపెట్టారు, దారివెంట తినటానికి ఫలహారాలుకూడా మూటగట్టి ఇచ్చారు. వెంట తెచ్చుకున్న డబ్బు ఖర్చుచేయవలిసిన అవసరంలేకుం డానే ప్రయాణం జరిగిపోయింది.

కాని వారు వింధ్యప్రాంతం సమీపించే సరికి వారికి ప్రయాణం కష్టం కాసాగింది. ఆ యేడు ఆ ప్రాంతంలో వానలు లేవు. ప్రజలు భయంకరమైన కరువుకాటకాలకు



గురిఅయారు. బావులూ, చెరువులూ వట్టి పోయి, మంచినీరుకూడా కొనుక్కోవలిసిన దుస్థితి పట్టింది. సత్రాలన్నీ మూసేశారు. ఎంతో డబ్బు ఇస్తేనేగాని ఎండుచెక్కలు కూడా తినటానికి దొరకటంలేదు.

"ఈ ప్రాంతం దాటేదాకా మనం ఎక్కువ మజిలీలుచేసి లాభంలేదు," అన్నాడు కనకయ్య. రాత్రిళ్లు రెండు జాములుమాత్రమే విశ్రమిస్తూ, వారు ఆగ కుండా నడకసాగించారు. భూదేవి బావురు మంటున్నది. ఎక్కడా జనసంచారం లేదు. ఇద్దరూ పెద్దవాళ్ళు, అయినా దీక్షతో ముందుకు నడుస్తున్నారు.



ఒకరోజు మధ్యాహ్నం కాంతయ్య కనకయ్యతో, "నాకు చాలా దాహంగా ఉన్నది. ఆ కనిపించే ఇంటికి వెళ్ళి ఇన్ని మంచి నీళ్ళు తాగి వస్తాను," అన్నాడు.

"నేను కాలుసాగిస్తాను. నువు వచ్చి నన్ను కలుసుకో!" అంటూ కనకయ్య వెళ్లిపోయాడు. కాంతయ్య తాను చూసిన ఇంటి ఆవరణలోకి అడుగుపెట్టి, "ఎవరండీ?" అని పిలిచాడు. జవాబు లేదు. కాంతయ్య ఇంట్లోకి వెళ్ళి చూశాడు. ఇంటి వాళ్ళు తలా ఒకదారినా చాపకట్టలల్లే పడిఉన్నారు. వారు బతికున్నదీ, లేనిదీ కూడా కాంతయ్య తెలుసుకోలేకపోయాడు.



ఆ ఇల్లు ఒక పేదరైతుది. ఆ రైతూ, అతని భార్యా, తల్లీ, కొడుకూ, కూతురూ కూడా తమకున్న ఒక కుంట పొలంలో పనిచేసి, పండిన సమయంలోనే ఒక పూట తింటే మరొక పూట పస్తుంటూ బతికే వాళ్ళు. కాటకం రాగానే వాళ్ళు దెబ్బ తిన్నారు. ఆ యేడు ఒక్క గింజకూడా పండలేదు. ముందు పాలిచ్చే గేదెను అమ్మారు. ఆతరవాత ఇంటో ఉన్న చెంబులూ, కంచాలూ, చిన్నచిన్న గిన్నెలూ అమ్మారు. అంతా అయిపోయింది. వారం రోజులనుంచీ ఎవరికీ తిండి లేదు. రెండు రోజులనుంచీ నీరుకూడా లేదు. రైతుతల్లి కిందటిరోజు నీళ్లుతెద్దామని కుండ తీసుకుని బావికి బయలుదేరి శోషతో పడిపోయింది. కుండ పగిలింది. ఆమె అక్కడినుంచి లేవలేకపోయింది.

కొనప్రాణాలతో ఉన్న ఈ కుటుంబాన్ని, ముఖ్యంగా చిన్నపిల్లల్ని, చూడగానే కాంతయ్యకు కడుపు తరుక్కుపోయింది. అయన ఇల్లంతా వెతికి ఒక చట్టి తీసుకొని బయటికి వెళ్ళాడు. బావి చాలా దూరాన వుంది. ఆ బావినుంచి చట్టితో నీళ్ళు తెచ్చి అందరి నోళ్లలోనూ పోశాడు. కాంతయ్య మూటలో రెండు మూడు రోజులకు సరి



పోయే దిబ్బ రొట్టెలున్నాయి. వాటిని తుంచి, నీళ్లలో తడిపి ముందు పిల్లలచేతా, తరవాత పెద్దవాళ్లచేతా తినిపించాడు. ఒక గంటలో అందరూ లేచి కూచోగలిగారు.

కాని అప్పుడే ఆపద గడవలేదు. అందుచేత కాంతయ్య ఊళ్ళోకి వెళ్ళి ఒక బానా, రెండు మూడు ముంతలూ, ఇంత బియ్యమూ, పప్పూ, ఉప్పూ, ఇతర వంట సామగ్రీ కొనుక్కుని వచ్చాడు. చుట్టుపక్కల ఉన్న ఎండుపుల్లలన్నీ మోపులు కట్టి తెచ్చివేశాడు. ఎన్నో రోజుల తరవాత ఇంటిల్లిపాతీ ఆ రాత్రికి అన్నం తిన్నారు.



అందరికీ కాంతయ్య దేవుడైపోయాడు. పిల్లలు "తాతయ్యా!" అంటూ వెంట పడ్డారు. వాళ్లు మళ్ళీ లేచి తిరుగుతూ, నవ్వుతూ, అరుస్తూ ఆడుకుంటూంటే కాంతయ్యకు పట్టరాని ఆనందమయింది. ఆ రాత్రి బయలుదేరి వెళ్ళి కనకయ్యను కలుసుకుందా మనుకున్నాడు. కాని తాను పోతే వీళ్ల మాటేమిటి? మరొక వారం రోజుల్లో వీరంతా మళ్ళీ పడిపోతారు. ఆ దృశ్యం జ్ఞాపకం వస్తేనే కాంతయ్యకు వళ్లు గరిబొడిచింది.

రెండు రోజులు గడిచాయి. "బాబాయి, నువు మా పాలిటి దేవుడల్లే వచ్చావు. నీ రుణం ఏ జన్మకూ తీరదు. కాని మాకు ఎంతని సహాయం చేస్తావు? దేవుడే మమ్మల్ని వదిలేసి ఊరుకున్నాడుగదా!" అన్నాడు రైతు నిస్సహాయంగా.

"ఏదో ఒకటి చెయ్యవద్దా, నాయనా? పొలం దున్నుదాం, దొడ్లో కూరలు పండిద్దాం," అన్నాడు కాంతయ్య.

"దున్నలూ బండీ ఉండేవి అమ్మేశాను. పొలం అదివరకే ముప్ఫై రూపాయలకు తాకట్టుపెట్టాను. ఏమన్నా పండితే బాకీదారు ఎగరేసుకుపోతాడు," అన్నాడు రైతు.

ఆ రోజే కాంతయ్య రైతును వెంటపెట్టుకుని వెళ్ళి బాకీదారుకు డబ్బు చెల్లించి

పొలం విడిపించాడు. మరొక నలభైరూపాయలు ఖర్చుచేసి బండీ దున్నలూ కొన్నాడు. రైతుకూ, అతని కుటుంబానికీ కొత్త శక్తి వచ్చినట్టయింది. కాంతయ్యను చూస్తేనే వారి ఉత్సాహం రెట్టింపయింది.

మూడు నెలలు గడిచాయి. రైతు పొలంలో పైరు మంచి ఏపుమీద ఉన్నది. ఇంటిల్లి పాతీ కష్టపడి దొడ్డి నిండా అంతు లేని కూరకాయలు పండిస్తున్నారు. దాని మీదనే వారికి చాలా రాబడి వస్తున్నది.

"ఇక నేను సాగవచ్చు. వీళ్ళ కష్టాలు తొలగినట్టే. కనకయ్య ఈపాటికి కాశీ చేరే ఉంటాడు. పుణ్యాత్ముడు!" అనుకున్నాడు కాంతయ్య. ఆయన వెళతానంటే ఇంటో ఎవరూ ఒప్పుకోలేదు. ముఖ్యంగా పిల్లలు ఏడిచి రాగాలు పెట్టి, "నువ్వు పోవద్దు తాతయ్యా!" అన్నారు.

వాళ్ళు తనను బుద్ధిపూర్వకంగా పోనివ్వరని తెలిసి కాంతయ్య ఒక రాత్రి, అందరూ నిద్రపోయే వేళ తన వస్తువులు మూటకట్టుకుని బయలుదేరాడు. కాని లెక్క చూసుకుంటే దగ్గిర పన్నెండు రూపాయల చిల్లరే ఉంది. "ఈ డబ్బుతో నేను కాశీ వెళ్ళేదేమిటి? ఈసారికి విశ్వేశ్వరుడి అనుగ్రహం లేదు," అనుకుని కాంతయ్య వెనక్కు తిరిగి మరో నెలకల్లా ఇల్లు చేరుకున్నాడు.



ఆ రోజు దాహం తీర్చుకుని వస్తానని కాంతయ్యా వెళ్లినాక, కనకయ్యా ఒక మైలు దూరం నడిచి ఒక చెట్టుకింద భోజనానికి కూర్చున్నాడు. భోజనం అయినాక రెండు ఘడియలు కునుకుతీశాడు. అప్పటికీ కాంతయ్యా జాడలేదు. రెండు గంటలు కాంతయ్యాకోసం చూస్తూ కూచున్నాక కనకయ్యాకు ఒక అనుమానం తగిలింది: తాను నిద్రపోయే సమయంలో కాంతయ్యా తనను దాటి వెళ్లాడేమో? మంచినీళ్లకు వెళ్ళిన వాడు గంటలతరబడి ఎందుకు రాడూ? ఈ అనుమానం తగలగానే కనకయ్యా చివాలున లేచి దారిపుచ్చుకున్నాడు.

వారాలూ నెలలూ గడిచాయి. కనకయ్యా దారిలో వచ్చిన ప్రతి గ్రామంలోనూ, "ఫలాని బట్టతల అసామీ యిటుగా వచ్చాడా?" అని కనబడినవారినల్లా అడుగుతూనే వచ్చాడు. కాని కాంతయ్యాను యెవరూ చూసినట్టు చెప్పలేదు.

చివరకు కనకయ్యా కాశీ చేరుకున్నాడు. గంగా స్నానం చేసి ఆలయాలన్నీ తిరిగి చివరకు విశ్వేశ్వరాలయం చేరుకున్నాడు. ఆలయంలో జనం కిటకిటలాడుతున్నారు. ఆ తొక్కిడిలో కనకయ్యా, పెద్దవాడు కావటం వల్ల, గర్భగుడిలోకి అడుగు పెట్టలేకపోయినాడు. తనకన్న అదృష్టవంతులు లింగాన్ని



తాకి పవిత్రులవుతున్నారు. దీపారాధనల వెలుగులో వారి ముఖాలు కనకయ్యకు స్పష్టంగానే కనిపిస్తున్నాయి. వారికేసి చూస్తున్న కనకయ్య నిర్ఘాంతపోయాడు. ఎందుకంటే ఒక వ్యక్తి లింగానికి నుదురు ఆనించి లేచి నిలబడేటప్పుడు ఆయన బట్టతల నిగనిగలాడింది. మరుక్షణం కాంతయ్య ముఖం కనకయ్యకు స్పష్టంగా కనిపించింది.

"ఔరా! నాకన్న ముందే వచ్చి లోపలికి దూరావా?" అని కనకయ్య, కాంతయ్యను మనసులో మెచ్చుకుని, బయటికి వచ్చేటప్పుడు అతణ్ణి పట్టుకునే ఉద్దేశంతో ఆలయ ద్వారంవద్ద నిలబడ్డాడు. సాయంకాలం దాకా చూసినా కాంతయ్య జాడ లేదు.

కాశీలో కనకయ్య మూడు రోజులున్నాడు. మూడు రోజులూ విశ్వేశ్వరాలయానికి వెళ్లాడు. మూడురోజులూ ఆయనకు శివలింగం సమీపాన కాంతయ్యా, ఆయన బట్టతలా కనిపించాయి.

కనకయ్య గయా, ప్రయాగా మొదలైన పుణ్యక్షేత్రాలు చూసుకుని గంగాజలంతో ఇంటికి తిరుగుప్రయాణమైనాడు. దారిలో ఆయనకు కాంతయ్య ఆగిన చోటూ, ఇల్లూ కనిపించాయి. ఆ ఇంటివారి నడిగితే కాంతయ్య విషయం తెలుస్తుందిగదా అని రైతు ఇంటికి వెళ్ళాడు.

అక్కడ కనకయ్యకు కాంతయ్య సంగతంతా తెలిసింది. కాంతయ్య ఆ ఇంటోనే మూడు మాసాలున్నాడంటే, తనకన్న ముందు కాశీ చేరటం అసంభవం!

"కాంతయ్యా! నువు నిజంగా పుణ్యాత్ముడివి! విశ్వేశ్వరాలయం గర్భగుడిలోకి నువ్వు ఎట్లా పోగలిగావో నాకర్థమయింది. విశ్వేశ్వరుణ్ణి తాకి పవిత్రంకావటానికి కాశీ దాకా పోనవసరంలేదని నువు రుజువు చేశావు!" అనుకుంటూ కనకయ్య ఇంటి దారి పట్టాడు.

—(టాల్‌స్టాయి ఆధారం)



## ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

1956 జూన్ సంచికలో ప్రకటింపబడే ఫోటోలకు నమూనాలు





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ ఏప్రిల్ 10-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/-లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26

---

## ఏప్రిల్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : దూర ప్రయాణానికి

రెండవ ఫోటో : దారి ప్రకాశం

పంపినవారు : జి. యస్. లక్ష్మీదేవి, 21, ఎల్లిగాన్‌వీధి, మద్రాసు 12.

బహుమతిమొత్తం రు. 10/- ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.



# ఇంద్రజాలము

## మైనం వత్తినుంచి నాణెములు

మామూలు మైనం వత్తి నుంచి నాణెములు తెప్పించటం చాలా తెలివైన ట్రిక్కు. నేనొక సారి ఒక మిత్రుడి ఇంటికి వెళ్లి నప్పుడు అక్కడి వారు నన్నేదైనా మంచి ట్రిక్కు చేసి చూపమన్నారు. నేనీ ట్రిక్కు చేసి వారిని రంజింపజేశాను.

నేను నాకోటు విప్పేసి చొక్కా చేతులు పైకి మడిచాను. అందరూ చూస్తుండగానే మామూలు మైనం వత్తి ఒకటి తెప్పించి వెలిగించాను. తరువాత నాచేతులు జ్వాలకు ఎగువగా పెట్టి తీసివారికి చూపాను. నాచేతులలో చాలా బంగారు నాణెము లున్నాయి! అందరూ నిర్ఘాంత పోయారు.

అపూర్వంగా కనిపించే ఈ ఇంద్రజాలంలోని రహస్య మేమంటే మైనం వత్తిలో ఏమీ గారడీ లేదు. రహస్యమంతా అగ్గిపెట్టెలో ఉన్నది. బొమ్మలను వరసగా పరిశీలించి నట్టయితే ఆవిషయం తెలిసి పోతుంది. 40 పుల్లలుండే మామూలు అగ్గి పెట్టె ఒకటి తీసుకోండి. దాని సొరుగు సగానికి ముందుకు తోసి, ఆ ఖాళీలో నాలుగైదు నాణాలు దాచెయ్యండి. ఈ సగం తెరిచిన అగ్గి పెట్టెను బల్లమీద ఉంచండి. అందులో మోసం ఉందని ఎవరూ అనుమానించరు.

ఈ సగం తెరిచిన అగ్గి పెట్టె చేతిలోకి తీసుకుని, ఒక పుల్ల తీసి మైనం వత్తి వెలిగించండి. అది వెలిగించే సమయంలో నిప్పు పెట్టె మూసి వెయ్యండి (1, 2 బొమ్మలు చూడండి) అగ్గి పెట్టె మూసేసమయంలో, లోపల దాచిన నాణెములు అరిచేతిలోకి వచ్చేస్తాయి. వాటిని అరిచేతిలోనే దాచి

ఉంచండి. చేతి కండరాలు ముడిచి వాటిసహాయంతో అరిచేతిలో వస్తువులు దాచి ఉంచటం హస్తలాఘవ మం టారు. ఇలా దాచిన నాణెములను తరవాత ప్రేక్షకులకు చూప వచ్చు. ఇక్కడ ఉన్న బొమ్మలు చూసి నట్ట యితే ట్రిక్కు తెలిసి పోతుంది. 1వ బొమ్మలో వెలిగించని మైనం వత్తి, ఐంద్ర జాలికుడి చేతిలో సగం తెరి చిన అగ్గి పెట్టె కనిపిస్తాయి. 2వ బొమ్మలో, మైనం వత్తి వెలిగించినాక అగ్గి పెట్టె మూసేటప్పుడు నాణెములు చేతిలోకి రావటం కనిపిస్తుంది. 3వ బొమ్మలో గల కుడిచేతిలో నాణె ములు దాచి ఉన్నాయి. 4వ బొమ్మలో "మైనం వత్తి నుంచి తెప్పించిన" నాణెము లున్నాయి. అగ్గి పెట్టెలో దాచి ఉంచిన నాణెములు 5వ బొమ్మలో చూపబడ్డాయి.












కొందరు ఐంద్ర జాలికులు నాణె ములను కట్ట కడతారు. కాని నా ఉద్దేశంలో వాటిని విడివిడిగా ఉంచ టమే మంచిది.

---

[పాఠకులు, ఈ గారడీని గురించి సల హాలు పొందదలిస్తే, వారు 'చందమామ' పేరు ఉదహరిస్తూ, ప్రొఫెసరుగారి పేర ఉత్తరం రాయవచ్చు. ఉత్తరాలు ఇంగ్లీషు లోనే రాయాలి.

వారి అడ్రసు యిది:—ప్రొఫెసర్ : పి. సి. సర్కార్, మెజిషియన్, పోస్టుబాక్సు 7888, కలకత్తా - 12.]

# అట్టచివరి బొమ్మ

## ఒకరోజు రాజు - 4

అహ్మద్ తిరిగివచ్చేలోపుగా అబూ అల్‌హసన్ ఒక్కొక్క వజీర్ చెప్పిన విషయాలన్నీ శ్రద్ధగా ఆలకించి, కొత్త ఉద్యోగా లివ్వవలసినవారికి ఇచ్చాడు. ఉద్యోగాల నుంచి తొలగించవలసిన వారిని తొలగించాడు. పరిపాలనలో అతను చాలా ప్రజ్ఞచూపాడు.

అబూ ఖజానాదారును పిలిచి, "ఫలాని పేటలో అబూ అల్ హసన్ యిల్లున్నది. ఎవరినడిగినా చెబుతారు. ఆ యింటికి వెయ్యి బంగారు దీనారాలు పంపించి, అబూ తల్లికి యిప్పించు. ఆమె చాలా యోగ్యురాలు. వాటిని ఖలీఫాగారు పంపారనీ, ఖజానాలో డబ్బు పుష్కలంగా వుంటే యింకా ఎక్కువే పంపివుండేవారనీ ఆమెతో చెప్పాలి. తెలిసిందా?" అన్నాడు.




ఖజానాదారు వంగి సలాము చేసి నిష్క్రమించాడు. కొత్వాలు అహ్మద్ వచ్చి, దండనాయకుడికీ, అతని అనుచరులకూ కొరతశిక్ష అమలుచేసినట్టు చెప్పాడు. అబూ ఆ రోజుకు సభ చాలించాడు. అందరూ కలిసి భోజనశాలకు వచ్చారు. అక్కడ అతనికి దాసీలు బంగారు పాత్రలలో, అమిత రుచ్యమైన వంటకాలు తెచ్చిపెట్టారు. తాను ఖలీఫానన్న విషయమై అబూ అల్ హసన్‌కు ఎట్టి సందేహమూ లేకుండా పోయింది.

అతను భోజనంచేస్తూ తనకు పరిచర్యలు చేస్తున్న యేడుగురు దాసీలనూ పరీక్షగా చూశాడు. వారి పేర్లు అడిగి తెలుసుకున్నాడు. వారిలోకల్లా అందగత్తెగా కనిపించినదాని పేరు గన్నా, అంటే చెరుకుగడ. ఈ గన్నా ముఖంలో అబూకు యేదో విచారం కనిపించింది.

భోజనాలు ముగిసినాక పళ్లు తెచ్చిపెట్టారు. తరవాత పానీయాలు

వచ్చాయి. గన్నా స్వయంగా ఒక లోటాలో పానీయం తెచ్చి అబూకు అందించింది. అది తాగుతూనే అబూ స్పృహతప్పి పడిపోయాడు. ఏమంటే అందులో మత్తుమందు కలిపారు. అరాత్రే, స్పృహలేని స్థితిలో అతన్ని ఖలీఫా నౌకర్లు యింటికి చేర్చి, పడక గదిలో పడుకోబెట్టి వెళ్ళిపోయారు.

అబూ అల్ హసన్ నిద్రలేచి, "ఎవరక్కడ?" అని కేకవేశాడు. కాని ఎవరూ రాలేదు. అతను కళ్ళు తెరిచి చూసేసరికి రాజభవనానికి బదులుగా అతి సామాన్యమైన యిల్లు కనబడింది. అందుచేత అతను కల గంటున్నానుకాబోలు ననుకుని, "జాఫర్! మస్రూర్! మీరంతా ఎక్కడ చచ్చారు?" అని కేకలు వేయసాగాడు.

ఈ కేకలు విని అతని తల్లి పరిగెత్తుకుంటూ వచ్చి, "ఏంరా, నాయనా? ఎందుకట్లా అరుస్తున్నావు? పీడకల వచ్చిందా?" అని అడిగింది.

అబూ తన తల్లిని గుర్తించక, "నువ్వెవతెవే, ముసలిముండా?" అన్నాడు కోపంగా.

"నేను నీ తల్లినికానుట్రా, అబూ అల్ హసన్? నన్నే గుర్తించలేవా?" అన్నది తల్లి. "అబూ అల్ హసన్ ఎవడు? నీకు మతిపోయిందా? నేను ఖలీఫా హరూన్ అల్ రషీద్‌ను!" అని అరిచాడు అబూ.

ముసలిది అంకిళ్ళు నొక్కుకుంటూ, "గట్టిగా అరవకురా, బాబూ! యెవరన్నా వింటే దయ్యం పట్టిందనుకునేరు! నువ్వేమిటి, ఖలీఫా ఏమిటి?" అన్నది.

"నేను ఖలీఫాను కానంటావా, ముసలిదానా?" అంటూ అబూ తల్లిని తన్నాడు. "ఎవరో శత్రువులు నా రాజ్యం అపహరించి నన్ను యిట్లా చేశారు. వాళ్ళెవరో నీకు తెలుసు. వాళ్ళతో నువ్వూ లాలూచీ అయావు. నా ద్రోహులెవరో చెబుతావా? నిన్ను చంపెయ్యనా?" అన్నాడు.

(ఇంకా వుంది)



# చిత్రకథ





బీద విద్యార్థుల సహాయార్థం, ఫ్యాన్సీడ్రెస్ వేషాలపోటీ వుంటుందని దాసూ, వాసూలు పత్రికలో చదివారు. ఆ పోటీలో గెలిచి బహుమతి సంపాయించేందుకు వాళ్లిద్దరూ రామలక్ష్మణుల వేషాలు ధరించారు. వాళ్ళ ధోరణిచూసిన 'టైగర్' తను అచ్చుగా బీదవాడి వేషంలో పోటీస్థలానికి వెళ్లింది. అక్కడ వున్న పెద్దలు బహుమతి, రామలక్ష్మణులకు కాక, టైగర్‌కు యిచ్చారు. రామలక్ష్మణుల వేషాల్లో వున్న దాసూ వాసూలు బావురుమనకుండా వుండలేక పోయారు.







# వార్తలు-విశేషాలు

ద్వితీయ పంచవర్షప్రణాళిక (1956-61) కింద జరిగే మొత్తం వ్యయం రు. 7,100 కోట్లు. ఇందులో రు. 4,800 కోట్లు కేంద్ర, రాష్ట్రప్రభుత్వాలనుంచీ, రు. 2,300 కోట్లు పెట్టుబడిదారులనుంచీ వస్తుందని అంచనా. దేశీయ ఆదాయం పెరిగి, దేశంలో జీవన ప్రమాణం హెచ్చటమూ; దేశంలో సత్వర పారిశ్రామికాభివృద్ధి—ప్రత్యేకించి మూల పరిశ్రమలూ, భారీపరిశ్రమలూ అభివృద్ధి కావటం—జరగటమూ; నిరుద్యోగ సమస్య విస్తృతంగా పరిష్కారం కావటమూ, ఆదాయాలలో హెచ్చుతగ్గులు తగ్గించటమూ ఈ పంచవర్షప్రణాళిక యొక్క ఆశయాలు. సోషలిస్టు సాంఘికవ్యవస్థ గమ్యం.

* * * *

ఫిబ్రవరి మాసంలో ముగ్గురు ప్రముఖ భారతీయులు దివంగతులయారు. లోకసభాసభ్యులు డా. మేఘనాథ సాహా ఫిబ్రవరి 16 న మరణించారు. అఖిల భారత ప్రజాసోషలిస్టు పార్టీ అధ్యక్షులూ, రాజ్యసభాసభ్యులూ అయిన ఆచార్య నరేంద్రదేవా ఫిబ్రవరి 19 న మరణించారు. లోకసభాధ్యక్షులు జి. వి. మావ్లంకర్ ఫిబ్రవరి 27 న మరణించారు. ఆయన స్థానే అనంతశయనంగారు లోకసభాధ్యక్షులుగా ఎన్నుకోబడ్డారు.

* * * *

"చందమామ" పాఠకులకు చిరపరిచితులైన ప్రొఫెసర్ పి. సి. సర్కార్‌గారు ప్రస్తుతం ఇంగ్లాండులో ఇంద్రజాల ప్రదర్శనలు ఇస్తున్నారు. వారి ఇంద్రజాల ప్రదర్శనాలను అక్కడి పత్రికలన్నీ ఎంతో ఘనంగా కొనియాడాయి.



సినిమా చిత్రాల నిర్మాణంలో ఇండియాది మూడవ స్థానమని ఐక్యరాజ్య విద్యాశాస్త్ర సాంస్కృతిక సమితివారి నివేదిక తెలుపుతున్నది. 1953 లో అమెరికాలో 344 చిత్రాలూ, జపానులో 302 చిత్రాలూ, ఇండియాలో 259 చిత్రాలూ తయారయాయి. ప్రపంచమంతటా లక్షకు పైబడిన సినిమా థియేటర్లున్నాయి. వెయ్యి కోట్లమంది ఏటా సినిమాలు చూస్తున్నారు.

*   *   *   *

ఇరాను చక్రవర్తి భార్యాసమేతంగా ఫిబ్రవరి 16 న ఇండియాకు వచ్చి ఈ దేశంలో మూడు వారాలపాటున్నారు.

*   *   *   *

ఆంధ్రప్రభుత్వం విద్యావిషయకమైన ఖర్చుకుగాను రు. 4,78,75,100 రూపాయలు కేటాయించింది. వీలయితే వచ్చే (1956-57) సంవత్సరమునుంచే మూడవ ఫారంవరకూ ఉచితవిద్య ఏర్పాటుచేయటానికి ప్రభుత్వం ఆలోచిస్తున్నట్టు ఆంధ్ర ముఖ్యమంత్రి శ్రీ గోపాలరెడ్డిగారు చెప్పారు.

*   *   *   *

బకింగ్‌హాం కాలవ అభివృద్ధి నిమిత్తం కేంద్రప్రభుత్వం ఆంధ్రప్రభుత్వానికి రు. 27 వేలూ, మద్రాసుప్రభుత్వానికి రు. 15 వేలూ మంజూరుచేసింది. ఈ కాలవ నిడివి ఆంధ్రలో 160 మైళ్ళు, మద్రాసులో 101 మైళ్ళు. ప్రస్తుతం ఈ కాలవలో 30 లేక 35 టన్నుల బరువు చేరవేసే పడవలు మాత్రమే పోతున్నాయి. 80 టన్నుల బరువు తీసుకుపోయే పడవలకు తగినంత లోతుగా ఈ కాలవను తవ్వాలని సూచన జరిగింది.

*   *   *   *

రాష్ట్ర పునర్నిర్మాణ బిల్లు ముసాయిదా మార్చి 18 న ప్రకటించబడింది. ఈ ముసాయిదా ప్రకారం భారతదేశంలో ఆంధ్ర-తెలంగాణా, అస్సాం, బీహార్, గుజరాత్, కేరళ, మధ్యప్రదేశ్, మద్రాసు, మహారాష్ట్ర, మైసూరు, ఒరిస్సా, పంజాబ్, రాజస్థాన్, ఉత్తరప్రదేశ్, పశ్చిమ బెంగాలు, జమ్మూ-కాశ్మీర్ అన్న 15 రాష్ట్రాలూ, బొంబాయి, ఢిల్లీ, హిమాచలప్రదేశ్, మణిపూర్, త్రిపురా, అండమాన్-నికోబార్ దీవులూ, లక్కదీవి, మినికోయ్-అమీన్ దీవులు అనే 7 కేంద్రపాలిత ప్రాంతాలూ ఉంటాయి.



Printed by B. NAGI REDDI at the B. N. K. Press Ltd., Madras 26, and Published by him for Chandamama Publications, Madras 26. Controlling Editor: SRI 'CHAKRAPANI'































# సన్‌లైట్ సబ్బు

బట్టలు చాలకాలము మన్నునట్లు చేయును

భారతదేశంలో తయారుచేయబడినది

S. 237-50 TLC

## చందాదారులకు మనవి

★

పైనెల చందమామలు యీనెల చివరి వారంలో పోస్టు అవుతవి. సకాలంలో అందనివారు, వారి పోస్టాఫీసులో ఫిర్యాదు చేస్తూ, పై నెల పదోతేదీ లోగా మాకు తెలియపర్చ గోరుతాము. ఆ పైబడి వచ్చు కంప్లెయింట్లు, గతనెలలో చేరలేదనే కంప్లెయింట్లు గమనించబడవు.

మేనేజరు

Photo by B. Bhansali



బహుమతి
పొందిన వ్యాఖ్య

దారి ప్రకాశం

పంపినవారు :
జి. యస్. లక్ష్మీదేవి, మద్రాసు - 12.

